## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..







"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని తెలుగు భక్తి వెబ్ సైట్ నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ ఫౌండేషన్ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) తెలుగు భక్తి వారి వెబ్ సైట్: www.telugubhakti.com
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో తెలుగు భక్తి వారి సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Helpline/WhatsApp: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## తెలుగు భక్తి వారి వెబ్ సైట్:

## http://www.telugubhakti.com/

Telugu Bhakti Slokas

www.telugubhakti.com/telugupages/main.htm

# Telugu Bhakti Pages

www.telugubhakti.com

**Best viewed with screen settings 1280X1024 pixels**

| Scriptures, Slokas and Stotras | | General | Downloads |
|---|---|---|---|
| Adi Sankaracharya | Rama Geeta | Appeal and Objectives | Audio Downloads |
| Aditya | Saraswathi | Bala Basha | Bhakti Screen Savers |
| Adwaitam | Sandharbha | Bhakti Celebrities | Printer Friendly Page |
| Ayyappa | Satya Sai | Bhakti Classicals | |
| Bhagavad Geetha | Shirdi Sai | Bhakti Links | **Pravachanaalu** |
| Bammera Pothana | Siva | Book Reviews | |
| Bhagavatam | Slokas with meaning | Jeji Mamayya Patalu | Bhaja Govindam |
| Brahma Sutras | Subrahmanya | Chatuvulu | Bhasmo Dhulita Vigrahaya |
| Durga | Suktas | Dasa Mudrani | Karma Siddhantam |
| Dattatreya | Sundara Kanda | Divine Guidance of Satya Sai | Class Prayers |
| Ganesh | Venkatesa | Kavitha Kadambam | Kenopanishad |
| Gayatri | Vishnu | Keerthanalu | Sri Narasimha Charitram |
| Guru | Vratas | Koonalamma Padalu | Soundarya Lahari |
| Hanuman | Upanishads | Prasnalu - Javaabulu | Ramana Saranagathi |
| Hindu Marriage System | Rigveda | Naturopathy | Vivekachoodamani |
| Krishna | Samhitaanuvadam | Rishi Vani | |
| Lakshmi | (Yoga Paranga) | Sai Krishna's Art | **Specials** |
| Mahabharat | Vyasa Bhagavatam | Satakalu | |
| Mantrapushpam | | Swamiji | Annamayya Pada Visleshana |
| Narada Bhakti Sootralu | | Tatvalu | Monthly |
| Nava Grahas | | Telugu Special | Satsang |
| Patanjali Yoga Sootralu | | Useful Links | Chinna Kathalu |
| Raghavendra | | Value Education | Class Prayers |
| Rama | | Web Hunt | Human Relations |
| Ramayanam | | Hindu Cultural | Nadiche Devudu |
| | | Questions & Answers | Stories of Alwars |
| | | Yoga | Stories of Bhaktas |
| | | Yoga Mudralu Bandhalu | Stories of Indian Sages |
| | | Yogasanas (Detailed) | Stories of Nayanars |
| | | | Sankara Vangmayamu |
| | | | Special Articles |
| | | | Hinduism and Mantras |
| | | | Personality Development |

Join Bhakti Group

Statistics of page views

[About us][Mission][People][Links][Books][Guest Book][Contact]

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# గీతా శాస్త్రం

## మూలం : శ్రీమద్భగవద్గీత

రచన

కొమరవోలు వేంకట శేష హనుమంతరావు



# రచయిత పరిచయం

బాపట్ల వాస్తవ్యులు కీ॥శే॥ కొమరవోలు బాలకృష్ణరాజ శర్మ, లలితదేవిలకు 1949 సం॥లో మార్చి 17వ తేదీన గుంటూరులో జన్మించిన మొదటి సంతానం వెంకట శేష హనుమంతరావు.

బాపట్లలో హై స్కూల్ విద్య అనంతరం మైసూరులో నేషనల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఇంజనీరింగ్‌లో ఎలక్ట్రికల్ ఇంజనీర్‌గా పట్టభద్రులు.

1974 మే 2వ తేదీన విజయశ్రీతో వివాహం.

సుమారు 3 సంవత్సరములు డక్టాన్ కాస్టింగ్స్, హైదరాబాద్‌లోను, 1976 నుండి సెంట్రల్ ఎలక్ట్రానిక్స్ ఇంజనీరింగ్ రీసెర్చ్ ఇన్స్టిట్యూట్, పిలాని (రాజస్థాన్)లోను ఉద్యోగం.

1979–80లో ఇండియన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ సైన్స్, బెంగుళూరులో డి.ఐ.ఐ.యస్.సి చదివారు.

దేశంలో మొట్టమొదటి కలర్ టీవీ, పి.హెచ్. కంట్రోలర్ ఫర్ సుగర్ ఇండస్ట్రీస్ డెవలప్‌మెంట్స్, వి.యల్.యస్.ఐ. డిజైన్, ఇండస్ట్రియల్ నెట్‌వర్క్‌లలో విశేష సేవలు అందించి, 1999లో సైంటిస్ట్ – ఇ II గా స్వచ్ఛంద పదవీ విరమణ.

వృత్తిరీత్యా బెల్జియమ్, జర్మనీలలో కొంతకాలం పనిచేశారు.

పలు రీసెర్చ్ పేపర్ల ముద్రణ జరిగింది.

ఇద్దరు పుత్ర సంతానం. ఆధ్యాత్మికాభిరుచి. భావపురి సీనియర్ సిటిజన్స్ అసోసియేషన్ కార్యదర్శిగా కాలయాపన.

# విషయ సూచిక

# హిందూ మతోద్భవం

మనిషి మొదట సుమారు ఒక లక్ష సంవత్సరాలు ఒక జంతువుగా బ్రతికాడని నేటి విజ్ఞానం అభిప్రాయపడుతోంది. తరువాత చిన్న గుంపులుగా తిరిగాడని తెల్పుతోంది. అప్పుడు మమకారాలేర్పడి వారిలో మరణించినవారి శరీరాన్ని భూమిలో పూడ్చిపెట్టారు. ఆదిమానవులు ఆఫ్రికా నుండి వలసలు వెళ్ళి విస్తరించి ప్రపంచమంతటా స్థిరపడ్డారని నేటి విజ్ఞానం అభిప్రాయం కొన్ని గుంపులు కలిసి తెగలుగా స్థిరపడ్డారు. కాలక్రమేణ మరణించిన వారిని గురించి అనేక నమ్మకాలు, ఆచారాలు ఏర్పడినవి. పెక్కు ప్రదేశాల్లో మరణించినవారు తమ చుట్టుప్రక్కల ఉండే జంతువులు, పక్షులు, సర్పాలు, జలచరాల రూపాలలో ఉండి తమను గమనిస్తుంటారని, వారిని సంతృప్తిపరిచి వారి నుండి సహాయం పొందవచ్చని నమ్మారు. అందువలన మొదట సర్పాలను, జలచరాలను, పక్షులను,జంతువులను ఆరాధించారు. ఆ తరువాత సగం మనిషి-సగం జంతువు లేక పక్షి రూపాలుగల ఆకారాలను ఆరాధించారు. ఒక గుంపు పైన తెల్పిన ఒక ఆకారాన్ని ఆరాధించేవారు. అదే ఆనాటి మతం అనుకుంటే ప్రతి గుంపు వారి మతంతో గుర్తింపు పొందేది.హిందూ మతంలోని సర్పం, ఆవు, ఎద్దు, కుక్క, చేప, తాబేలు, వరాహం, దేవతల వాహనాలైన ఎలుక, పులి, సింహం, హంస, గ్రద్ద, గుడ్లగూబ, నెమలి, ఒంటె, గణేశ్, హనుమాన్, నరసింహ, హయగ్రీవ, తుంబుర ఆ కాలం నాటి ఆరాధ్యులే.

కాలక్రమేణ కుటుంబ వ్యవస్థ ఏర్పడింది. ప్రతి కుటుంబానికి ఆ కుటుంబ పూర్వీకులు ఆరాధ్యులైనారు. ఒక తెగ యొక్క నాయకుని పూర్వీకులు ఆ తెగలోని వారందరికీ ఆరాధ్యులు. ఆ కాలంలోనే మందిరాలు, పూజారులు ఏర్పడ్డారు. బహుశ హిందూ మతంలోని గ్రామ దేవతలు ఆవిధంగా ఏర్పడినవారై ఉండవచ్చు.

మానవులు వ్యవసాయం చేయడం అలవరుచుకున్న తరువాత వ్యవసాయాన్ని ప్రభావితం చేసే ప్రకృతి శక్తులైన సూర్యుడు, వాన, నీరు, గాలి, ఉరుము, మెరుపు, భూమి, ప్రకృతిలోని ఇతరమైన అగ్ని, ఆకాశం, చంద్రుడు, నక్షత్రం, సెలయేరు, నది, కొండ, చెట్టు మొదలైన వాటిని ఆరాధించారు. ప్రకృతిని పై ఆరాధ్యుల తల్లిగాను, ప్రపంచానికే మాతృమూర్తిగాను ఆరాధించారు. కాలక్రమేణ ప్రకృతిలోని శక్తులను గురించి, ఇతర విషయాల గురించి అధ్యయనం చేశారు. ఆ విషయాలను, ఆరాధనలను, ఆనాటి సంస్కృతిని తెలిపేవే హిందూ మతంలోని వేదాలు.

కొంత కాలానికి బలవంతులైన నాయకులు కొన్ని తెగలను కలిపి గణాలనేర్పరిచారు. ఒక గణంలో కలిసిన తెగల ఆరాధ్యులందరినీ ఒక చోట ఉంచి ఆ గణం యొక్క నాయకుని ఆరాధ్యుల్ని ముఖ్య ఆరాధ్యులుగా ఉంచి ఆరాధనలు జరిపేవారు. గణేశ్వర ఆరాధన వేదాలలోని ఇంద్రుని ఆరాధన ఇటువంటిదై ఉండవచ్చు. కొన్ని ప్రాంతాల్లో గణ నాయకుని ఆరాధ్యుల్ని మాత్రం ఆరాధించి ఇతర ఆరాధ్యుల ఆరాధనలను నిలిపివేసేవారు. ఆవిధంగా మందిరాలు అర్చకులు ఏర్పడ్డారు. అర్చకులు ఆరాధ్యులందరినీ కలుపుతూ కథలు,సిద్ధాంతాలు చేసేవారు. హిందూ మతంలోని పురాణాలు అటువంటివై ఉండవచ్చు.

ప్రకృతిని సకల ఆరాధ్యుల తల్లిగా, మాతృమూర్తిగా ఆరాధించారు. వ్యవసాయంలో మొలక, పెరుగుదల, పంట (మొక్కలు)ను కోసి, ధాన్య సేకరణ తిరిగి మొలక ఆధారంగా మరణానంతరం తిరిగి జీవించుట లేక జీవింపజేయుట, పునర్జన్మ మొదలైన నమ్మకాలేర్పడ్డాయి. ఆ నమ్మకాల నుండి ఆత్మకు సంబంధించిన సిద్ధాంతాలేర్పడినాయి. ఆ ఆలోచనా సరళి ముందుకు సాగి సృష్టికి మూలం పరమాత్మ అనీ, ఆది పరాశక్తి అనీ నమ్మకాలేర్పడినాయి.

కాలగతిలో అనేక సమయాల్లో అనేక గణాలవారు అనేక కారణాల వలన భారతావనికి వలస వచ్చి స్థిరపడ్డారు. వారితో వారి ఆచార వ్యవహారాలు, నమ్మకాలు, ఆరాధ్యులు భారతావనిలో స్థిరపడ్డాయి. సామాజిక వ్యవస్థ రాజ్యాలు, జాతులుగా ఎదిగినాయి.

సుమారు 4500 సంవత్సరాలకు పూర్వం సింధూ నాగరకతలోని వారు పశుపతిని ఆరాధించేవారని అభిప్రాయం ఉంది. కాలక్రమేణ పశుపతి ఆరాధనే హిందూమతంలో శైవంగా అభివృద్ధి చెందింది.

సుమారు 4000 సంవత్సరాలకు పూర్వం ఆసియా మైనర్‌లో పెక్కు భాషలతో ఇండో-ఐరోపా గణాలు ఉండేవి. వారిది హిట్టైట్ నాగరకతగా, వారిని 'హరియన్‌లు'గా తెలుపుతున్నారు. వారిలో సూర్య దేవత 'అరుణ' ఆరాధన ఎక్కువగా

ఆచరణలో ఉండేది. 'మా' అనబడే సకల ఆరాధ్యుల తల్లిని ఆరాధించేవారు. ఆమె భర్త 'అట్టిస్' మరణం, పునరుజ్జీవనం, వివాహములను తెలిపే కథ ప్రచారంలో ఉండేది. ఆ పునరుజ్జీవనమును పండుగగా చేసుకునేవారు. పై ఆరాధనలు భారతావనిలో హిందూమతంలో సూర్య ఆరాధన, శాక్తేయంగా అభివృద్ధి చెందినాయి.

సుమారు 4000 సంవత్సరాలకు పూర్వ పర్యా (నేటి ఇరాన్)లో ఆనాటి పార్శీలతో కలిసి వేదాలలో తెలిపిన విధంగా ఆరాధనలను చేసిన వైదిక జాతులుండేవి. వారందరూ ఆవుని, కుక్కను ఆరాధించారు.అగ్నిని ఆరాధించారు. హోమాలు చేశారు. హోమ రసం (వేదాలలో సోమరసం)ను పవిత్రమైనదిగా ఎంచి సేవించేవారు. సూర్య దేవత మిత్రాను ఆరాధించేవారు. యిమ్ (వేదాలలో యమ)ను  మొట్టమొదటి కాపరిగాను, న్యాయ శాస్త్రాన్నిచ్చినవానిగాను ఆరాధించారు. ఆనాటి పార్శీ భాష ఋగ్వేద భాష ఒక్కటిగా ఉండేవి. సుమారు 4000 సంవత్సరాల క్రితం పార్శీలు, వైదికులు విడిపోయారు.

ఆ తరువాత వైదికులు దేవతలను ఆరాధించారు. దేవతల అధిపతి ఇంద్ర (పార్శీలో అంద్ర). ఆనాటి పార్శీలు ఇంద్రను, దేవతలను దుష్ట శక్తులుగా తలచేవారు.పార్శీల మత గ్రంథమైన అవెస్తా–విస్పర్డ్‌లో దేవతలు (దేవతలను ఆరాధించేవారు). నేటి ఇరాన్‌కు ఉత్తరాన మధ్య ఆసియా స్టెప్పీస్ సరిహద్దు వద్ద 'మజేంద్రన్' (మహేంద్రం)లో ఉండేవారని తెలిపింది.

సుమారు 2700 సంవత్సరాల క్రితం నేటి ఇరాక్ ప్రాంతంలోని అస్సీరియా నాగరకత వారు ఇటు భారతావని నుండి అటు ఇజ్రాయిల్ వరకు సుమారు 100 సంవత్సరాలు ఒక విశాల సామ్రాజ్యాన్ని ఏలారు. వారు అసురులను ఆరాధించేవారు. వారి ఉరుము ఆరాధ్యుడు 'రావణాసుర్' బాగా ప్రచారంలో ఉండేవారు. పార్శీలు బహుశ అస్సీరియన్లతో కలిసి అసురులను (పార్శీలో అహుర) ఆరాధించేవారు. పార్శీల ముఖ్య ఆరాధ్యుడు 'అహుర మజ్దా'. వైదికులకు అశ్శీరియన్లతోను, పార్శీలతోను జరిగిన యుద్ధాలు హిందూ మత గ్రంథాలలో దైవాసుర యుద్ధాలుగా చాలా కనిపిస్తాయి. కాలక్రమేణ వైదికులు, కొందరు పార్శీలు భారతావనికి వలస వచ్చి స్థిరపడ్డారు. బహుశ కొందరు అస్సీరియన్లు కూడా భారతావనికి వలస వచ్చి స్థిరపడి ఉండే అవకాశం లేకపోలేదు.

పూర్వం జర్మన్లు ఆరాధించిన 'బరి (అడవి పంది), హిందూమతంలోని 'వరాః అవతారంలోని 'వరాః' శబ్దరీత్యా దగ్గరగా ఉండి ఒకే అర్థం కలిగిన పదాలు. పూర్వం ఐరోపాలోని జర్మన్లు ఆరాధించిన 'ఒడిన్', 'వొదన్', స్వీడన్లు ఆరాధించిన 'ఒడెన్', 'స్లావ్'లు ఆరాధించిన 'పెరుణ్', వేదాలలోని 'వరుణ్' పదాలుకూడా శబ్దరీత్యా దగ్గరగా ఉండి నీరు, వానలకు సంబంధించిన ఆరాధ్యుల పేర్లు. స్లావ్ జాతి ఆరాధ్యుల పేర్లలోని 'బోగ్', పర్యాలోని 'బగ', సంస్కృతంలోని 'భగ' పదాలు కూడా శబ్దరీత్యా దగ్గరగా ఉండి ఒకే అర్థం కలిగిన పదాలు. సంస్కృతంలోని భగ శబ్దంతో భగవాన్, భగవతి పదాలేర్పడినవి. పూర్వం జర్మన్ల మతగ్రంథం 'ఎద్ద', వైదికుల 'వేదం' పదాలు కూడా అటువంటివే. పై విషయాలననుసరించి ఐరోపా జాతులు, వైదిక జాతులు పూర్వం ఒక ప్రదేశంలో ఉండి తరువాత విడిపోయిన జాతులై ఉండవచ్చు.

హిందూ మత మూలమైన వేదాలలో 'మిత్ర' ఒక ఆరాధ్యుడు. సూర్యుడినే మిత్ర దేవతగా సుమారు 4000 సంవత్సరాల క్రితం నుండి ఆరాధించారు. నీతికి సంబంధించిన దేవతగా కూడా ఆరాధించారు. మిత్రను పార్శీలు కూడా ఆరాధించారు. పర్యాలో జాతీయ మతంగా కూడా ఉండేది. రోమన్ సామ్రాజ్యంలో కూడా 'మిత్ర' బాగా ప్రసిద్ధి చెందిన ఆరాధ్యుడు. అక్కడ మిత్రను మంచి యోధుడుగా కూడా ఆరాధించారు. రోమ్ నగర భూగర్భంలో పురాతన మిత్ర ఆరాధనా మందిరం నేటికీ ఉన్నది. మిత్ర జన్మదిన వేడుకలు డిసెంబర్ 25న జరిపేవారు.

నేడు ప్రపంచవ్యాప్తంగా వాడుకలో ఉన్న క్యాలెండర్‌లో వారంలోని దినాల పేర్లు, చాలా నెలల పేర్లు నాడు రోమన్ సామ్రాజ్యంలో రోమన్లు పెట్టిన వారి ఆరాధ్యుల పేర్లే. వారి సంవత్సరం మార్చి నెల నుండి ఆరంభమయ్యేది. ఏడవ, ఎనిమిదవ, తొమ్మిదవ, పదవ నెలలైన సెప్టెంబర్, అక్టోబర్, నవంబర్, డిసెంబర్ పేర్లలో సప్త (7), అష్ట (8), నవ (9), దశ (10) సంస్కృత శబ్దాలు. పై విషయాలను గమనిస్తే నాటి రోమన్ సంస్కృతిపై భారతీయ సంస్కృతి ప్రభావం కనిపిస్తుంది.

## వేదమతం :

స్వయం ప్రకాశమైన జ్ఞానంతో వెలుగొందే మహానుభావులు ఋషులు. వీరు లోక కళ్యాణము కొరకు కర్మలను, ఉపాసనలను ఆచరించేవారు. వారు దర్శించిన సత్యాలను మంత్రాలుగా తెలిపారు. ఆ మంత్ర సమూహాలే వేద సంహితలు. ఇవి వైదిక వాఙ్మయంలో మూల గ్రంథాలు.

అనేక ప్రదేశాలలో అనేక ఆరాధ్యుల స్తుతులు, ఆనాటివారి కోర్కెలు, ప్రార్థనలు, వారి విజ్ఞానం, నమ్మకాలు, ఆచారాలు, సమాజ వ్యవస్థ మొదలైన విషయాలపై తెలిపిన మంత్రాలను ఋక్కులంటారు. రాగబద్ధంగా గానం చేయబడిన ఋక్కులను సామలంటారు. ఆరాధనా పద్ధతులైన యజ్ఞయాగాల క్రియా కలాపాన్ని వివరించే మంత్రాలను యజులంటారు. మొదట ఇవన్నీ కలిసిపోయి ఉండేవి. శ్రీకృష్ణ ద్వైపాయనులవారు వాటిని వేరుచేసి ఋక్సంహిత, సామసంహిత, యజుస్సంహితలుగా చేసి శిష్యులకు నేర్పారు. శ్రీకృష్ణ ద్వైపాయనులవారు వేద మంత్ర సమూహాలను వేరు చేశారు కనుక వ్యాసుడుగా ప్రసిద్ధి చెందారు. వేద సంహితలకు వ్యాఖ్యానాలుగా బ్రాహ్మణాలు అవతరించినవి. బ్రాహ్మణం కలిసి ఉండనిది శుక్లయజుస్సంహితగా గుర్తింపు చెందింది. అధర్వ ఋషి లోకానికి చాటిచెప్పిన వేదం అధర్వ వేదం. శత్రువులను నాశనం చేయడానికి పరమాయుధం అధర్వవేదమని మనుస్మృతి ప్రశంసించింది. దీనిని మహా ప్రమాణంగా మహాభారతం అంగీకరించింది. రాజనీతి తంత్రాలను, అర్థతంత్రాలను, కృషి వాణిజ్యాలను, సమాజ నిర్మాణాన్ని ప్రతిపాదించే అర్థ వేదం అధర్వ వేదానికి ఉపవేదం. దీని సహాయంతో బృహస్పతి, చాణక్యులు అర్థ శాస్త్రాలు, శుక్రాచార్యుని శుక్రనీతి ఏర్పడ్డాయి.

## దేవతలు :

వేదాలలో తెలిపిన ఆరాధ్యులను దేవతలంటారు.దేవతల రాజు ఇంద్రుడు. తరువాత ముఖ్య దేవత అగ్ని. ఆ తరువాత సోముడు, అశ్వినీ దేవతలు, మరుత్తులు, మిత్ర, వరుణుడు, ఉషస్సు, సూర్యుడు, సవిత, పూష (అష్టా), విష్ణువు, బృహస్పతి, రుద్రుడు, యముడు, ద్యావాపృథువులు, త్వష్ట (విశ్వకర్మ), వాయుదేవుడు, అదితి (దేవమాత), దితి (రాక్షసమాత), పర్జన్యుడు (మేఘం), ప్రజాపతి (హిరణ్యగర్భుడు), విద్వాంసులు, విశ్వేదేవులు, యజ్ఞము, ఈశ్వరుడు, పితరులు, అబ్దేవతలు (జలములు), చంద్రుడు, సినీవాలి, ఋతువులు, పురుషుడు, గరుత్మంతుడు, సుపర్ణుడు, గంధర్వులు, పితృదేవతలు, ఇంద్రాణి, మన్మధుడు, అర్యముడు, పరమేశ్వరుడు, వైశ్వానరుడు, ప్రాణం, లింగోక్తులు, సరస్వతి, దిక్కు, వసువులు, బ్రహ్మ, ఆత్మ, క్షత్రపతి, గృహపతి, జగదీశ్వరుడు, కృషీవలుడు, వీరుడు, సేనాపతి మొదలైన వారు ఆరాధ్యులు.

దేవతలందరిలోని దేవుడు ఒక్కడే అని తెలిపారు.

## అరణ్యకాలు :

కాలక్రమేణ యజ్ఞ యాగాలపై ఆసక్తి సడలి జీవస్వరూపం, ప్రపంచ సృష్టి, భగవంతుడు మొదలగు అంశాలను గురించి ఆలోచనలు మొదలుపెట్టారు. గృహస్థాశ్రమం నుండి నిష్క్రమించి వానప్రస్థులై అరణ్యంలో దీక్షితులై అధ్యయనం చేసినవే అరణ్యకాలు.

అక్కడ నచికేతాగ్ని అనే కొత్త అగ్ని పూజా విధానం మొదలయింది.ప్రత్యక్ష దైవమైన సూర్యుడిని సకల దేవతా స్వరూపునిగాను, పరబ్రహ్మగాను ఆరాధించారు. సర్వవేద సారంగా గాయత్రి మంత్రాన్ని రూపొందించారు. ఆరోగ్య భాగ్యానికి అధిదేవతగా పూజించారు. నిత్యం సూర్య నమస్కారాలను ఆచరించారు. పంచ మహాయజ్ఞాలను ప్రతిదినము నిర్వర్తించారు.

తరువాతి కాలంలో 'ఉపాసన' అనే కొత్త ఆచరణ మొదలుపెట్టారు. ఉపాసన అంటే ఏకాగ్రతమైన మనస్సుతో ధ్యానించుట, జపించుట. తరువాత కాలంలో ఏర్పడిన భక్తి మార్గానికి బీజం ఉపాసన.

చివరకు మహర్షులు సృష్టి స్థితి లయలకు మూలమైన సత్యమేది? ఆత్మ ఎవరు? అనే తత్త్వ విచారణ చేశారు. అన్నింటికీ పరమ మూలం ప్రజ్ఞానం. అదే పరబ్రహ్మ అని నిర్ణయించారు. అంతా ప్రజ్ఞానమే అని తెలుసుకున్నారు. అదే బ్రహ్మవాదం.

**తత్త్వం :**

ప్రజ్ఞామయుడైన ఆదిత్యుడు మహాపురుషధిష్ఠాన దేవత. పరబ్రహ్మకు ప్రతీక.

సర్వ ప్రాణులయందు వినబడకుండా, చూడబడకుండా, తెలియబడకుండా ఉంటూ సర్వాన్నీ వింటూ, చూస్తూ, తెలుసుకుంటూ ఉంటున్నవాడే ఆత్మ.

**పురుష సూక్తం :**

విరాట్పురుషుడు సకల ప్రాణ స్వరూపుడు. సృష్టిలోని ప్రాణులన్నింటి యొక్క తలలు, ఇంకా ఇతర అవయవాలు అతనివే. ఇతడు బ్రహ్మాండం లోపల, బయట కూడా వ్యాపించి ఉంటాడు. ఇతడు కాలాతీతుడు. భూత భవిష్యత్తులన్నీ తెలుసు. ఇతడు నాశనము లేనివాడు. సృష్టి అంతా ఇతని నుండే ఉద్భవించినది. తిరిగి ఇతనిలో అంతర్థానమవుతుంది.

**గాయత్రి :**

పృథివి, అంతరిక్షం, స్వర్గం, అగ్ని, వాయువు, ఆదిత్యుడు, వాగ్రూపం, ప్రాణం ఈ ఎనిమిది ప్రజాపతి (భగవంతుడు) వలన సృష్టించబడినవి. వీటి ప్రతీక రూపమే గాయత్రి ఛందస్సు. అందువలన గాయత్రి బ్రహ్మరూపంగా భావించబడుతుంది. వేదత్రయ రసమే తపస్సు. ఆత్మ దర్శనం పొందడానికి మైత్రాయణీయారణ్యకంలో ప్రాణాయామం, ప్రత్యాహారం, ధ్యానం, ధారణ, తర్కం, సమాధి అనే ఆరు అంగాలుగల షడంగ యోగంలో తెలిపారు.

యోగ శాస్త్రంలో యమం, నియమం, సుఖాసనం, ప్రాణాయామం, ప్రత్యాహారం, ధారణ, ధ్యానం, సమాధి అను 8 అంగాలుగల అష్టాంగయోగాన్ని తెలిపారు.

**ఉపనిషత్తులు :**

అరణ్యకాలలోని తత్త్వ జిజ్ఞాస ప్రధానంగాగల అధ్యాయాలను ఉపనిషత్తులుగా వేరుచేశారు. ప్రకృతిని దేవతలుగా, అదితిగా వర్ణించారు. మాతృదేవతగా, అఖండ శక్తికి మూర్తిమతిగా ఆరాధించారు. బ్రహ్మజ్ఞానాన్ని కలిగించేది ఉపనిషత్తు. తరువాత ఋషులు ధ్యానంలో నిమగ్నమైపోయారు.

ఆ తరువాత సామాన్యులకు సన్మార్గాన్ని చూపేవారు భారతావనిలో కరువైనారు. ఆ పరిస్థితిలో బౌద్ధ, జైన మతాలేర్పడినాయి. వాల్మీకి రామాయణాన్ని వ్రాశారు. శ్రీకృష్ణద్వైపాయనులు వేదాలను ఋక్సామయజుర్వేదాలుగాను, అధర్వణ వేదంగా నాలుగుగా నియంత్రించి 17 పురాణాలు, భారత భాగవతాలు వ్రాసి శిష్యులకు నేర్పి ప్రచారం చేసి వేద వ్యాసుడని పేరునొందారు. తరువాత కాలంలో దేవతల వర్ణనలననుసరించి రూపకల్పన చేశారు.

దేవాలయాలు, అర్చకులు, పురోహితులు భారతావనిలోకన్నా చాలా కాలం పూర్వమే మెసపటేమియా, గ్రీకు నాగరకతలలో ఉండేవి. అలెగ్జాండర్ దండయాత్ర తరువాత ఈ సంస్కృతి భారతావనికి వచ్చి ఉండవచ్చు. ఆగమ శాస్త్రాలను ఆవిష్కరించి వాటిననుసరించి దైవ మందిరాలను నిర్మించి దేవతా మూర్తులను ప్రతిష్ఠించి దేవాలయాలను ఏర్పరిచారు. పూజా విధానాలను అమలుపరిచారు.

కాలక్రమేణ శైవ, శాక్తేయ, వైష్ణవ, వైదిక శాఖలు అనేక ఉపశాఖలు అభివృద్ధి చెందాయి. మతపరంగా భిన్నత్వమున్న భారతావనిలో మౌర్య సామ్రాజ్యం, ఆ తరువాత గుప్త సామ్రాజ్యం అంతమై పెక్కు రాజ్యాలుగా మిగిలిపోయింది. భారతావనిలో ఐకమత్యమేర్పరచాలని ఆదిశంకరాచార్యుల వారు శైవం లోని ముఖ్య ఆరాధ్యుడైన శివుడిని, వైష్ణవంలోని ముఖ్య ఆరాధ్యుడైన విష్ణువుని, వైదికంలో ముఖ్య ఆరాధ్యుడైన బ్రహ్మను త్రిమూర్తులుగాను, శాక్తేయంలోని ఆదిపరాశక్తిని పార్వతి, లక్ష్మి, సరస్వతులను త్రిమూర్తుల ధర్మపత్నులుగాను వీరంతా ముఖ్య ఆరాధ్యులుగాను హిందూమతాన్ని ఏర్పరచి, భారతావనిలోని రాజులందరినీ కలిసి హిందూ మతాన్ని ప్రచారం చేసి భారతావని నలుదిక్కులా పీఠాలనేర్పరచి భారతావనిలో ఐకమత్యం కోసం పాటుపడ్డారు. వారి తరువాత వారి ప్రయత్నం ముందుకు సాగలేదు. భారతావనిలో అటు మత పరంగాను, ఇటు రాజకీయంగాను ఐకమత్యం లేని కారణంగా ఐకమత్యంతో బలోపేతంగా ఎదిగిన విదేశీయ శక్తుల ఆక్రమణ, పరిపాలనలలో భారతావని సుమారు 1000 సంవత్సరాలు అనేక కష్టనష్టాలపాలయింది.

స్వాతంత్ర్యం సిద్ధించి భారతదేశం అవతరించిన తరువాత సుమారు 60 సంవత్సరాలు అందరికీ కూడు, గుడ్డ, గూడు ఏర్పరచడంతోనే సరిపోయింది. ఇప్పుడు దేశ పటిష్టత కొరకు పాటుపడవలసిన సమయం ఆసన్నమయింది. భారతదేశంలో ఐకమత్యం, నీతి, నిజాయితీలతో కూడిన జీవన విధానం పెంపొందించాలి. దానికి సాధనం హిందువులందరూ ఆదరించే భగవద్గీతలోని గీతా శాస్త్రం.

000

# గీతా శాస్త్రం

## *తొలి పలుకులు*

సింధు నదికి ఇటువైపు (తూర్పున) ఉన్నవారు హిందువులు. హిందువుల స్థానము హిందూస్థాన్. దీనినే హిందూ దేశమని, భారతదేశమని కూడా అంటారు. గ్రీకులు, ఐరోపా వారు హిందూస్థాన్‌ని ఇండియా అన్నారు. హిందువుల మతం హిందూ మతం. సనాతన ధర్మమైన హిందూ మతం సూక్ష్మంగా భగవంతుని ద్వారా తెలుపబడింది. అదే భగవద్గీత.

ద్వాపర యుగాంతంలో అంటే కొన్ని వేల సంవత్సరాల పూర్వం తెలుపబడిన భగవద్గీత హిందూ దేశ చరిత్ర పుటల్లో చాలా మరుగునపడివుందని చెప్పకతప్పదు. మనకు తెలిసి అలెగ్జాండర్ కాలం (క్రీ.పూ. 325) నుండి విదేశీయులు కుసంస్కారం వలన సామ్రాజ్యవాదంతో హిందూదేశాన్ని ఆక్రమించి ఈ దేశస్థులను అమానుషంగా చిత్రహింసలు పెట్టి పైశాచికంగా మందిరాలను ధ్వంసం చేసి, ఈ దేశ సంపదను కొల్లగొట్టి తమ దేశాలకు దోచుకుపోయారు. చివరకు ఈ దేశస్థులను తిండికి కూడా లేని కటిక దరిద్రంలో ముంచిన ఆంగ్లేయుల నుండి శాంతియుత స్వాతంత్ర్య సమరాన్ని నడిపి హిందూదేశ స్వాతంత్ర్యాన్ని సాధించిన మహాత్మా గాంధీజీ భగవద్గీత నుండి స్ఫూర్తిని, ఆత్మబలాన్ని పొందుతుండేవారు.

నేటి ఆధునిక విజ్ఞాన సృష్టి సంబంధ సిద్ధాంతం అయిన 'బిగ్ బ్యాంగ్' సిద్ధాంతం కొన్ని వేల సంవత్సరాల పూర్వం తెలుపబడిన భగవద్గీతలోని సృష్టి సంబంధ విషయంతో మౌలికంగా ఏకీభవిస్తోంది.ఆధునిక విజ్ఞానానికి అంతుపట్టకపోయినప్పటికీ ఇటీవల కాలంలో ఉనికిని ఆమోదిస్తున్న ఆత్మ విషయాల గురించి చక్కటి సిద్ధాంతాలను ఆవిష్కరించింది భగవద్గీత.

సర్వమానవ సౌభ్రాతృత్వం, వసుధైక కుటుంబం, అహింస, శాంతి వంటి మానవ శ్రేయస్సు కోరే ఆలోచనలు హిందూ దేశం నుండి వెలువడడానికి మూలకారణమైన సర్వ ప్రాణుల యెడల సమభావం కలిగివుండడం అనే విషయం మానవాళికి అందించింది భగవద్గీత.

అంతటి అమూల్యమైన జ్ఞానాన్ని సామాన్య ప్రజానీకానికి అందించడమే ముఖ్యోద్దేశంగా భగవద్గీతలోని మహాభారత సంగ్రామ సన్నివేశ సంబంధిత విషయాలు ఈ రచనలో వదిలివేయడం జరిగింది. సులువుగా అర్థమవ్వడానికి భగవద్గీతలోని విషయాలను సక్రమంలో పేర్చి, శ్లోకాలను విషయానుసారంగా ఏరి క్రమంలో కూర్చి పండిత పామరులందరికీ అర్థమవ్వడానికి ఆ శ్లోకాల తాత్పర్యాలను క్లుప్తంగా అందించడానికి చేసిన ప్రయత్నమే ఈ రచన. ఇదే గీతా శాస్త్రం. శ్లోకం ప్రక్కనే ఆ శ్లోకం సంఖ్యను 'అధ్యాయం : వరుస సంఖ్య'గా తెలుపబడింది. ఉదా : రెండవ అధ్యాయంలో ఏడవ శ్లోకాన్ని (2 :7)గా సూచించబడింది. గీతా ప్రెస్, గోరఖ్‌పూర్ వారి శ్రీమద్భగవద్గీతలోని సంఖ్యను ఉపయోగించడమైనది.

కాల గమనంలో హిందూ మతం గురించి కొన్ని అపోహలు ధూళిలాగా పేరుకుపోయినవి. ఆ ధూళిని వదిల్చే ప్రయత్నం ఈ రచనలో కొంత జరిగింది. హిందూ మతం తెలిపిన మానవ శ్రేయస్సు కొరకు అందరూ ఆచరించవలసిన మరికొన్ని విషయాలను ఈ రచన ద్వారా తెలపడం జరిగింది.

మానవులందరూ ఈ గీతా శాస్త్ర విషయాన్ని అలవరచుకొని మంచి సంస్కారాన్ని పొంది, శాంతి పథంలో నడుస్తారని ఆశిద్దాం !

**సర్వేజనా ః సుఖినోభవంతు !**

## ఉపోద్ఘాతం :

ఓం

పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం

వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతమ్ !

అద్వైతామృతవర్షిణీం భగవతీమ్ అష్టాదశాధ్యాయినీమ్

అంబ త్వామనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్ !

వ్యాస మహాముని రచించిన మహాభారతము మధ్య భగవానుడు అర్జునకు తెలిపినదే భగవద్గీత.

భారత సంగ్రామ క్షేత్రమున అర్జునుడు భగవానునితో అనెను :

కార్పణ్యదోషోపహతస్వభావః పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః !

యచ్ఛ్రేయః స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే శిష్యస్తే హం శాధి మాం త్వాం ప్రసన్నమ్ ! **(2:7)**

దయ అనే బలహీనతకు లోనై నా స్వభావము క్షీణించి ధర్మాధర్మ విచక్షణ చేయలేకున్నాను. నీ శిష్యుడను. నా కర్తవ్యమును ఉపదేశింపుము.

అంతట భగవానుడు ప్రకృతి, ప్రాణి, శరీరము, జీవాత్మ, పరమాత్మ, సృష్టి, మనిషి గుణాలు, ఆహారం, బుద్ధి, జ్ఞానం, ధృతి, సుఖాలు, భావాలు, కర్మ శ్రద్ధ, లక్షణాలు, కర్మఫలం, మరణానంతరం, పునర్జన్మలు, సంస్కారం,పాప ప్రక్షాళన, ముక్తి, మోక్షము, మోక్ష సోపానాలు, పరమాత్మ అను విషయములు అన్నియు విశదముగా తెలిపి స్వభావాలు, వర్ణాలు, వర్ణ ధర్మాలు తెలిపి క్షత్రియునికి ధర్మ పోరాటమే కర్తవ్యముగా బోధించెను. ఆ పోరాటం చేయవలసిన విధానం కూడా తెలిపి పోరాటమునకు ప్రోత్సహించెను. భగవానుడు అర్జుననకు తెలిపిన విషయాలే గీతా శాస్త్రం.

# గీతా శాస్త్రం

## 1.0 ప్రకృతి :

భూమిరాపోనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ ।

అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా ॥ **(7 :4)**

భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారం అని, భిన్న ప్రకృతి ఎనిమిది విధములుగా ఉన్నది.

అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్ ।

జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్ ॥ **(7 :5)**

భిన్న ప్రకృతికి అన్యముగా న్యూన ప్రకృతిని ఉపయోగించుకొను ప్రాణులను కూడియున్న పరాప్రకృతి వేరొకటి కలదు.

భిన్న ప్రకృతితో తయారైన శరీరాలతో చేరి, శరీరాలను ప్రాణులుగా చేసి ప్రకృతిని ఉపయోగించుకునే పరాప్రకృతి వేరొకటి ఉంది.

ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి ।

వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్ ॥ **(13 :19)**

ప్రకృతి, పురుషుడు అనబడు ఈ రెండునూ మొదలు లేనివని తెలుసుకో. వికారాలు, గుణాలు ప్రకృతి నుండి ఉద్భవించినవి.

భిన్న ప్రకృతిని ప్రకృతియనీ, పరాప్రకృతిని పురుషుడు అనీ ఈ శాస్త్రంలో వ్యవహరించారు.ప్రాణులకుండే వికారాలు, గుణాలు భిన్న ప్రకృతినుండి తయారైన శరీరములనుండి కలుగుచున్నవి.

ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ ।

అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా ॥ **(7 : 6)**

సకల ప్రాణుల జన్మ మూలము ఈ రెండు ప్రకృతులే (భిన్న, పరా ప్రకృతులే). అదే విధంగా సమస్త జగత్తునకు ఉత్పత్తి ప్రళయములకు మూలకారణము నేనే (పరమాత్మ/భగవాన్).

సూర్యుడు, సూర్యుని చుట్టూ తిరుగుతున్న గ్రహాలు, వాటి చుట్టూ తిరుగుతున్న చంద్రుని వంటి చాలా ఉపగ్రహాలు అన్నింటినీ కలిపి మన సౌర కుటుంబం అంటారు. సౌర కుటుంబాన్ని చాలా దూరం నుండి చూస్తే స్వయంప్రకాశమైన సూర్యుడు మాత్రమే ఒక నక్షత్రంగా కనిపిస్తుంది. గ్రహాలు, ఉపగ్రహాలు కనపడవు. భూమి చుట్టూ తిరుగుతున్న చంద్రుడు మాత్రం భూమి నుండి దగ్గరగా ఉండడం వలన మనకు పెద్దదిగా కనిపిస్తుంది. మనకు కనిపించే నక్షత్రాలన్నీ నిజానికి సూర్యుని వంటి గోళాలే. వాటి చుట్టూ వాటి సౌర కుటుంబాలు ఉండవచ్చు. సుమారు లక్ష కోట్ల నక్షత్రాలు ఒక చక్రాకారంలో కలిసి తిరుగుతుంటాయి. అటువంటి చక్రాన్ని 'గేలాక్సీ' అంటారు. నేటి విజ్ఞానానికి తెలిసి విశ్వంలో సుమారు 40 వేల కోట్ల గేలాక్సీలు ఉన్నాయి.

పైన తెలిపినదంతా మనము చూడగలిగే పదార్థాలతో ఉన్నాయి. దీని అంతటికీ 5 రెట్లు మనము చూడలేని పదార్థాలు (డార్క్ మేటర్), 16 రెట్లు మనము తెలుసుకోలేని శక్తి (డార్క్ ఎనర్జీ) ప్రకృతిలో ఉన్నదని శాస్త్రజ్ఞులు ధృవీకరించారు. ప్రకృతిలోని పైన తెలిపిన వాటినుండి ఉద్భవించిన సకల ఘన, ద్రవ, వాయు పదార్థాలు, శక్తులే విశ్వంలోని సకల చరాచర వస్తువుల ఉనికికి ఆధారం.

పై విషయాలను అనుసరించి ప్రకృతిలో మనము చూడలేని పదార్థాలు, తెలుసుకోలేని శక్తులు ఉన్నవని గుర్తించాలి. అదృశ్య పదార్థాలు, అదృశ్య శక్తులతో ఉన్న అదృశ్య లోకాలు కూడా ఉండే అవకాశం ఉన్నదేమో! ప్రాణులు ప్రకృతిలోని విషయాలను తెలుసుకోగలిగే మనసు, ప్రాణుల శరీర తత్వాలను అనుసరించి ప్రవర్తింపజేసే బుద్ధి, ప్రతి ప్రాణి తనను తాను ఇతరుల నుండి వేరుగా తలంపజేసే అహంకారం ప్రతి ప్రాణికీ ఉంటాయి. మనసు, బుద్ధి, అహంకారాలు ఉన్నవని ప్రతి వానికినీ తెలుసు.కాని అవి శరీరంలోని మెదడులో ఎక్కడ ఏ పదార్థంతో ఉన్నవో తెలుసుకోలేము.కానీ ఇవి కూడా ప్రకృతిలోనివే.

ప్రకృతిలోని భూమి, నీరు, వాయువులలో ఉన్న పదార్థములు ఆకాశంలో ఉన్న సకలము, అగ్ని ప్రకృతిలో ఉన్నవి. వీటితో విభిన్న నిర్జీవ వస్తువులు అన్నియు తయారవుతాయి. వీటితో ప్రాణుల నిర్జీవ శరీరాలు కూడా తయారవుతాయి. ఇవికాక జీవులలో మనసు, బుద్ధి, అహంకారం ఉంటాయి. ఇవి ప్రకృతిలో అదృశ్యంగా ఉంటూ వ్యక్తమవుతుంటాయి. ఇవి కూడా ప్రకృతిలో భిన్నత్వాన్ని కలుగజేస్తాయి.అందువలన భూమి, ఆకాశం, నీరు, వాయువు, అగ్ని, మనసు, బుద్ధి, అహంకారములతో కూడిన ప్రకృతిని భిన్న ప్రకృతి అంటారు. ఇది నిర్జీవమైనది.

## 1.1 పరమాత్మ :

ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ ।

అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా ॥ **(7 : 6)**

సకల ప్రాణుల జన్మమూలము ఈ రెండు ప్రకృతులు (భిన్న పరాప్రకృతులు). అట్లే సమస్త జగత్తుకుఉత్పత్తి ప్రళయములకు మూలకారణము నేనే (పరమాత్మ).

సర్వయోనిషు కౌంతేయ మూర్తయః సంభవంతి యాః ।

తాసాం బ్రహ్మ మహద్యోనిః అహం బీజప్రదః పితా ॥ **(14 : 4)**

అన్ని జన్మ మూలములందు రూపములు జన్మించును. వాటన్నింటికి మూలము మహద్బ్రహ్మ (మూల ప్రకృతి). నేను (జీవము) బీజమునిచ్చు తండ్రిని.

ప్రాణుల శరీరము అండమునుండి తయారవుతుంది. ఈ తయారీ ఒక నిర్దిష్ట పథకముననుసరించి ఉంటుంది. ఆ పథకము ప్రాణుల శరీర కణములలోని జన్యు (జీన్స్) భాష (కోడ్)లో పొందుపరచబడి ఉంటుంది. ఈ పథకము నాలుగు అక్షరాలుగల పదాలతో ఉంటుంది. మానవ శరీర తయారీ పథకము సుమారు 300 కోట్ల పదాలతో ఉంది. అందులో గుణాలు, లక్షణాలు కూడా పొందుపరచబడి ఉంటవి.

భాష అనేది వివేకమున్న ప్రాణులకు మాత్రమే సాధ్యము. నేటి (2011) మానవుల విజ్ఞానానికి జన్యు భాషలో ఉన్న మానవ శరీర తయారీ పథకము ఇంకా పూర్తిగా అర్థం కూడా కాలేదు. మరి ఆ పథకాన్ని ఆ భాషలో పొందుపరచినది ఎవరు? వారు మనకంటే ఊహించలేనంత ఎక్కువ వివేకవంతులై ఉండాలి. వారెవరు? ఒకవేళ వారు చాలా వివేకముగల గ్రహాంతరవాసులనుకుంటే మరి వారి శరీర తయారీ పథకము వారి జన్యు భాషలో పొందుపరచినదెవరు? మొదలెక్కడ? ఆ వివేకము ఎక్కడుంది? ఆ వివేకము అవ్యక్తంగా ఉండి ఉండాలి. ఆ వివేకము ప్రకృతిలో స్వతస్సిద్ధంగా ఉండి ఉండాలి. ఆ వివేకమునే 'పరమాత్మ' అన్నారు.

## 1.2 సృష్టి :

సహస్రయుగపర్యంతమ్ అహర్యద్బ్రహ్మణో విదుః ।
రాత్రిం యుగసహస్రాంతాం తే హోరాత్రవిదో జనాః ॥ **(8 : 17)**

వేయి (పెక్కు) యుగముల కాలము బ్రహ్మ (మూల ప్రకృతి)కి ఒక పగలు. అంతే కాలము తరువాత రాత్రి ముగుస్తుందని ఎరిగినవారు తెలుసుకొనిరి.

అవ్యక్తాద్వ్యక్తయః సర్వాః ప్రభవంత్యహరాగమే ।
రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవావ్యక్తసంజ్ఞకే ॥ **(8 : 18)**

(బ్రహ్మ) పగలు ఆరంభమున సకలము అవ్యక్తమునుండి వ్యక్తమగును. రాత్రి రాగానే అవ్యక్తమునందు లీనమగును (దీనిని ఒక కల్పమందురు).

సృష్టి ఆరంభమునకు ముందు అంతయూ శూన్యమే. ఎక్కడనూ ఏమియూ లేదు. సృష్టి ఆరంభమవగానే శూన్యము నుండి శక్తి బయల్పడి అతి వేగంగా వ్యాపించనారంభించింది. ఆ శక్తి నుండి అణువుకన్నా చిన్నవైన పరమాణువులు ఉద్భవించినవి. కొంత కాలమునకు కొన్ని పరమాణువులు కలసి ఉదజని అణువులు ఉద్భవించాయి. అవి కలిసి హీలియం అణువులు ఏర్పడినవి. ఆకర్షణతో ఆ అణువులు ఒక చోట చేరి గోళముగా రూపొందింది. అందులో ఆకర్షణ ఎక్కువై ఒత్తిడి వలన ఇతర ధాతువులు ఏర్పడినవి. వాటి ఒత్తిడి వలన వేడి ఎక్కువై గోళము పేలి బరువైన ధాతువులన్నియు అన్నివైపులకు వెదజల్లబడినవి. బరువు తక్కువగా ఉన్న ఉదజని మధ్యలో కేంద్రీకృతమై సూర్యునిగా ఆవిర్భవించింది. వెదజల్లబడ్డ ఇతర ధాతువులు కాలగమనంలో సూర్యుని చుట్టూ గ్రహములుగా రూపొందినవి. అది ఒక సౌర మండలము. ఆవిధంగా శూన్యము నుండి లక్షల కోట్ల కోట్ల సౌర మండలాలు ఉద్భవించి వాటిలో ప్రకృతి, పెక్కు చరాచరాలు, జీవరాశులు ఏర్పడినవి. ఇప్పటి సృష్టి మొదలై సుమారు 1400 కోట్ల సంవత్సరాలైనవని ఖగోళ శాస్త్రజ్ఞులు తెలుపుతున్నారు. సుమారు 10 వేల కోట్ల సంవత్సరాల తరువాత ఈ సృష్టిలోని సర్వస్వము శక్తిగా మారి అదృశ్యమగునని తెలుపుతున్నారు. దాని తరువాత చాలా కాలమునకు మరలా సృష్టి జరుగునని కొందరు ఖగోళ శాస్త్రజ్ఞుల అభిప్రాయము.

సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాన్తి మామికామ్ ।
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్ ॥ **(9 : 7)**

కల్పాంతమున సకల భూతాలు (మూల ప్రకృతి, పంచభూతాలు, సకల ప్రాణులు..) నా ప్రకృతిని (అవ్యక్తం) ప్రవేశించును. తిరిగి కల్పారంభమున వానిని నేను సృజించుచున్నాను.

ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః ।
భూతగ్రామమిమం కృత్స్నమ్ అవశం ప్రకృతేర్వశాత్ ॥ **(9 : 8)**

నేను మరల మరల భౌతిక ప్రకృతిని ప్రవేశించి అప్రయత్నముగా ప్రకృతివశమున భూత సముదాయములను సృజింతును.

మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్ ।
హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే ॥ **(9 : 10)**

నా అధ్యక్షతన భౌతిక ప్రకృతి చరాచరాలను (ప్రాణుల్ని) సృష్టించును. ఆ కారణంగా జగత్తు పనిచేయుచున్నది.

భూతగ్రామః స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే ।
రాత్ర్యాగమే వశః పార్థ ప్రభవత్యహరాగమే ॥ **(8 : 19)**

జీవ సముదాయమంతయు ఈ విధముగా మరల మరల జన్మించుచు (బ్రహ్మకు) రాత్రి అవగానే నశించును. (బ్రహ్మకు) పగలవగానే అప్రయత్నముగా జన్మింతురు.

## 1.3 ఆత్మ :

జ్ఞేయం యత్తత్ ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వామృతమశ్నుతే ।
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే ॥ **(13–12)**

దేనిని తెలుసుకొని అమృతత్వమును ఆస్వాదింపగలవో అట్టి తెలుసుకొనవలసిన దానిని వివరించెదను. అనాది అయినదియు నాకు అధీనమైనదియు అయిన బ్రహ్మ ప్రకృతి కాదు, పరమాత్మ కాదు.

సర్వతః పాణిపాదం తత్ సర్వతోక్షిశిరోముఖమ్ ।
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥ **(13–13)**

అంతటను చేతులతో, పాదములతో, కన్నులతో, శరీరములతో, ముఖములతో, చెవులతో అన్ని లోకములను ఆవరించి ఉండును.

సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవివర్జితమ్ ।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ ॥ **(13–14)**

ఇంద్రియములు కలిగి ఉండదు. వాటికి మూలము నిర్గుణుడు. గుణములకు మూలము గుణానుభవము తెలిసినవాడు. ఆసక్తి లేకుండా అన్నింటినీ పోషించును.

బహిరంతశ్చ భూతానామ్ అచరం చరమేవ చ ।
సూక్ష్మత్వాత్ తదవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్ ॥ **(13–15)**

కదిలేవి మరియు కదలని జీవులన్నిటి లోపల బయట కూడా ఉండును. అతి చిన్నదిగా ఉండి తెలుసుకొనుటకు వీలుకానిది. దూరముగాను దగ్గరగా కూడా ఉండును.

అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్ ।
భూతభర్తృ చ తద్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ ॥ **(13–16)**

విభజన లేనిది అన్నిటియందును విభజించబడియున్నట్లుండును. అన్నిటినీ భరించే ఆ తెలుసుకొనవలసినది అన్నిటినీ కబళించును మరియు వృద్ధినొందించును.

జ్యోతిషామపి తజ్జ్యోతిః తమసః పరముచ్చతే ।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్ ॥ **(13–17)**

ప్రకాశవంతమైన వాటిలోని ఆ జ్యోతి చీకటికి ఇతరమైనదని చెప్పబడుచున్నది. జ్ఞానము, తెలుసుకొనవలసినది, జ్ఞానముయొక్క గమ్యము అందరి హృదయములో ఉన్నది.

## 1.4 ప్రాణి :

మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్ ।
సంభవః సర్వభూతానం తతో భవతి భారత ॥ (14 : 3)

నా మహద్బ్రహ్మము (మూల ప్రకృతి) నందు జీవము నుంచి సకల ప్రాణుల జననము కలుగజేయుచున్నాను.

ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే ।
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥ (13 : 1)

ఈ శరీరమును క్షేత్రమనియు, దీనినెరిగిన వానిని (ఆత్మ) క్షేత్రజ్ఞుడనియు జ్ఞానులు తెలుపుదురు.

యావత్సంజాయతే కించిత్ సత్త్వం స్థావరజంగమమ్ ।
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్ తద్విద్ధి భరతర్షభ ॥ (13 : 26)

పుట్టి ఉన్నటువంటి ఏ చరాచరమైనా (ప్రాణియైనా) క్షేత్ర–క్షేత్రజ్ఞుల కలయిక వలననే అని తెలుసుకో.

క్షేత్రమునెరిగిన ఆత్మనే క్షేత్రజ్ఞుడు అంటారు. క్షేత్ర క్షేత్రజ్ఞుల కలయిక వలననే ఏ ప్రాణియైనా ఉన్నది.

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత ।
క్షేత్రక్షేత్రజ్ఞయోః జ్ఞానం యత్తద్ జ్ఞానం మతం మమ ॥ (13 : 2)

అన్ని దేహాలలో ఉన్న క్షేత్రజ్ఞుడు కూడా నేనే అని తెలుసుకో. దేహము, క్షేత్రజ్ఞులను గూర్చి తెలుసుకొనుటే జ్ఞానమని నా అభిప్రాయం.

ఋషిభిర్బహుధా గీతం ఛందోభిర్వివిధైః పృథక్ ।
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః ॥ (13 : 4)

(క్షేత్ర క్షేత్రజ్ఞుల గురించి) ఋషులు వేదాలలోను, బ్రహ్మసూత్రాలలోను సహేతుకముగా తెలిపారు.

మహాభూతాన్యహంకారో బుద్ధిరవ్యక్తమేవ చ ।
ఇంద్రియాణి దశైకం చ పంచ చేంద్రియగోచరాః ॥ (13 : 5)

ఇచ్ఛా ద్వేషః సుఖం దు:ఖం సంఘాతశ్చేతనా ధృతిః ।
ఏతత్ క్షేత్రం సమాసేవ సవికారముదాహృతమ్ ॥ (13 : 6)

పంచ మహాభూతములు (భూమి, ఆకాశం, అగ్ని, వాయువు, జలం), అహంకారం, బుద్ధి, వ్యక్తము కానిది, పదకొండు ఇంద్రియములు (జ్ఞానేంద్రియాలైన కళ్ళు, చెవులు, ముక్కు, నాలుక, స్పర్శను తెలిపే భాగాలు, మనస్సు, కర్మేంద్రియాలైన చేతులు, కాళ్ళు, జననాంగం, నోరు, శరీరము), ఐదు ఇంద్రియర్థాలు (దృశ్యం, శబ్దం, వాసన, రుచి, స్పర్శ), కోరిక, ద్వేషం, సుఖం, దు:ఖం, స్థూల శరీరం, చైతన్యము, నిశ్చయము అనే వికారాలతో కూడిన క్షేత్ర స్వరూపం సంగ్రహంగా ఉదహరింపబడినది.

ప్రాణుల శరీరము భూమి నుండి ఉద్భవించిన ఘన, ద్రవ, వాయు రూపములలో ఉన్న అనేక ధాతువులతో తయారైనది. ఇది కొంత ఘన పరిమాణము కలిగివున్నది. దీని పరిసరాలలోని విషయములను తెలుసుకొనుటకు దృశ్యమును చూపు కళ్ళు, శబ్దములను తెలుపు చెవులు, వాసనను తెలుపు ముక్కు, రుచులను తెలుపు నాలుక, స్పర్శను తెలుపు శరీరము కలవు. కళ్ళు, చెవులు, ముక్కు, నాలుక, శరీరములను పరిసర జ్ఞానమును అందజేయుట వలన జ్ఞానేంద్రియాలంటారు. జ్ఞానేంద్రియాలందించే దృశ్యము, శబ్దము, వాసన, రుచి, స్పర్శలను ఇంద్రియార్థాలు అంటారు. జ్ఞానేంద్రియాలు కొన్ని పరిధులలోని ఇంద్రియార్థాలను మాత్రమే అందించగలవు. ఉదాహరణకు కళ్ళు ఎరుపు రంగు కల వెలుగు (సెకనుకు 4 కోట్ల కోట్ల తరంగాలు) నుండి ఊదా వెలుగులను (సెకనుకు 7.9 కోట్ల కోట్ల తరంగాలు) మాత్రం అందించగలవు. చెవులు సెకనుకు 20 తరంగాల నుండి 20 వేల తరంగాలు గల శబ్దములను మాత్రం అందించగలవు.

జ్ఞానేంద్రియాలనుండి అందించబడ్డ ఇంద్రియార్థాలన్నింటిని కలిపి తెలిపేది మనసు. మనసులో జ్ఞాపకాలలోని విషయాలను కూడా పరిశీలించవచ్చు. మనసు తెలిపే విషయాలను, ప్రజ్ఞను ఉపయోగించి అర్థం చేసుకునేది జీవుడు. జీవునికి అహంకారం ఉంటుంది. అర్థమైన విషయాలననుసరించి జీవుని యొక్క ఇష్టాయిష్టాలను (కోరిక, ద్వేషం) అనుసరించి హృదయంలో సుఖ దుఃఖాలు కలుగుతాయి. జీవి తన గుణము, శరీర తత్వముననుసరించి ఉన్న బుద్ధి వలన స్పందించి, ప్రజ్ఞను ఉపయోగించి, తన నిశ్చయానుసారము తాను చేయవలసిన కార్యక్రమమును రూపొందించుకొని కాళ్ళు, చేతులు, నోరు, జననాంగము, ఇతర శరీర భాగాలనుపయోగించి తాను రూపొందించిన కార్యమును ఆచరిస్తుంది. కార్యాచరణకు ఉపయోగించే శరీర భాగాలను కర్మేంద్రియాలంటారు.

నిర్జీవ ఇంద్రియాలను చలింపజేసి ఉపయోగించుకొనుటకు అవ్యక్తము, చైతన్యవంతమైన సూక్ష్మ శరీరము ఉపయోగపడుతుంది. పైన తెలిపిన అవయవాలకు ఆధారమైన స్థూల శరీరము ఉంటుంది.

జీవికి గల ఇష్టాయిష్టాలే ఆ ప్రాణియొక్క వ్యక్తిత్వాన్ని నిర్ధారిస్తాయి. వాటి వలన కోరికలు ఉత్పన్నమవుతాయి. జీవి ప్రజ్ఞ జీవశక్తికి మూలమైన ఆత్మ మీద ఆధారపడి ఉంటుంది. ఆత్మతో కలిసివున్న జీవిని జీవాత్మ అంటారు.

ధాతువులు అగ్ని, వాయువు, జలములతో తయారై కొంత ఘన పరిమాణము కలిగిన స్థూల శరీరము, దానికున్న జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు భౌతికంగా కనిపించే శరీరము.

ప్రాణియొక్క భౌతిక శరీరంలో అవ్యక్తమైన సూక్ష్మ శరీరంతో అదృశ్యమైన మనసు, అహంకారాలతో జీవి ఉంటుంది. దీనికి భౌతిక శరీర తత్వాన్ని అనుసరించి బుద్ధి ఉంటుంది. జీవి వ్యక్తిత్వాన్ని నిర్ధారించే కోరికలు (ఇష్టాలు, ద్వేషాలు, అయిష్టాలు) ఉంటాయి. జ్ఞానేంద్రియాలనుండి మనసుకు అందే ఇంద్రియార్థాలు మనసులోని తెలిసిన విషయాలను అర్థం చేసుకున్నాక కష్టసుఖాలను అనుభవింపజేసే హృదయము, జీవికి స్పందన కలుగజేసే నిశ్చయము అదృశ్యంగా ఉంటాయి.

పైన తెలిపిన అదృశ్యమైనవి, భౌతిక శరీరములను కలిపి క్షేత్రము అంటారు. దీనికి చైతన్యముంటుంది.

కార్యకరణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్చతే ।
పురుషః సుఖదు:ఖానాం భోక్తృత్వే హేతరుచ్యతే ॥ **(13 : 20)**

పనులు, సాధనములు చేయువారిని ఉత్పన్నము చేయుటలో ప్రకృతి సాధనమనియు సుఖ దు:ఖములననుభవించుటలో పురుషుడు (జీవాత్మ) సాధనమని చెప్పబడుచున్నది.

జీవి ఆత్మపై ఆధారపడి ఉంటుంది. ఆ రెండింటినీ కలిపి జీవాత్మ లేక పురుషుడు అంటారు. ప్రకృతి పనులను చేయిస్తుంది. జీవాత్మ సుఖ దుఃఖాలను అనుభవిస్తుంది. ప్రకృతి, ప్రకృతి నుండి ఉత్పన్నమైన క్షేత్రము జీవికి మోహము కలిగించి కోరికలు, అవసరాలను కలుగుజేస్తాయి. ఆ కోరికలను, అవసరాలను తీర్చుకొనుటకు అవసరమైన సాధనములను, ఆ సాధనములను రూపొందించువారిని, కర్తలను ఉత్పన్నము చేయునది ప్రకృతి.

ప్రకృతిలో సంభవించెడి ఘటనల ఫలితముల వలన కలిగెడు సుఖదుఃఖాలను అనుభవించేది పురుషుడు (జీవాత్మ).

## 1.5 శరీరం :

అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తాః శరీరిణః ।
అనిశినో ప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత ॥ **(2 : 18)**

పరిమితి లేని, ఎప్పటికీ నశించని శాశ్వతమైన దేహధారి (జీవాత్మ) యొక్క శరీరములు నశించునవియే ...

అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత ।
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా ॥ **(2 : 28)**

జీవులన్నీ పుట్టుకకు ముందు వ్యక్తము కావు. మధ్యలో (భౌతిక శరీరంతో జన్మించాక) వ్యక్తములు. మరణానంతరం అవ్యక్తములు. కనుక (వారికోసం) దు:ఖమెందుకు?

## 1.6 జీవాత్మ :

నజాయతే మ్రియతే వా కదాచిత్

నాయం భూత్వా భవితా వా న భూయః ।

అజో నిత్యః శాశ్వతోయం పురాణో

న హన్యతే హన్యమానే శరీరే ॥ **(2 : 20)**

భూత వర్తమాన భవిష్యత్ కాలములలో ఎన్నడైన ఆత్మకు జన్మగాని, మరణముగాని లేదు. జన్మ లేనిది, నిత్యము, శాశ్వతము అయిన ఆత్మ శరీరము చంపబడినను చావదు.

వేదావినాశినం నిత్యం య ఏనమజమవ్యయమ్ ।

కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతి కమ్ ॥ **(2 : 21)**

ఆత్మ నాశము లేనిదని, నిత్యము, జనన క్షయములు లేనిదనియు తెలిసినవాడు ఎవరినైనా ఎట్లు చంపును? ఎట్లు చంపించును?

య ఏనం వేత్తి హంతారం యశ్చైవం మన్యతే హతమ్ ।

ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే ॥ **(2 : 19)**

ఆత్మ చంపునని భావించువాడు, చంపబడునని భావించువారివురూ అజ్ఞానులే. ఆత్మ చంపదు. చంపబడదు.

వాసాంసి జీర్ణాని యథా విహాయ

నవాని గృహ్ణాతి నరోపరాణి ।

తథా శరీరాణి విహాయ జీర్ణా

న్యన్యాని సంయాతి నవాని దేహీ ॥ **(2 : 22)**

మనిషి చెడిపోయిన వస్త్ర వస్తువులను వదలి కొత్త వాటిని గ్రహించినట్లుగా దేహధారి (జీవాత్మ) చెడిపోయిన శరీరాన్ని వదలి ఇతర కొత్త దానిని గ్రహించును.

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః ।

న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః ॥ **(2 : 23)**

దీనిని (ఈ ఆత్మను) ఆయుధములు ఛేదింపజాలవు. అగ్ని దహింపజాలదు. నీరు తడుపజాలదు. వాయువు ఆర్పజాలదు.

అచ్ఛేద్యో యమదాహ్యో యమ్ అక్లేద్యో శోష్య ఏవ చ ।

నిత్యః సర్వగతః స్థాణుః అచలో యం సనాతనః ॥ **(2 : 24)**

(ఇది) ఛేదించుటకు, దహించుటకు, తడుపుటకు, ఆర్పుటకును సాధ్యము కానిది. ఇది ఎల్లప్పుడు అంతటను వ్యాపించి ఉండునది, చలింపనిది, స్థిరమైనది, శాశ్వతమైనది.

అవ్యక్తో యమచింత్యో యమ్ అవికార్యోయముచ్యతే ।

తస్మాదేవం విదిత్వైనం నానుశోచితుమర్హసి ॥ **(2 : 25)**

ఈ ఆత్మ వ్యక్తము కానిది, ఊహింపనలవికానిది, వికారములు లేనిదని తెలుసుకో. దీనికై శోకింపకు.

దేహీ నిత్యమవధ్యో యం దేహే సర్వస్య భారత ।

తస్మాత్ సర్వాణి భూతాని న త్వం శోచితుమర్హసి **(2 : 30)**

ప్రతి దేహంలోను ఉండే ఆత్మ చంపుటకు వీలుకానిది. కనుక ఏ జీవిని గూర్చియైనా శోకింపకు.

మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః ।

మనఃషష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి ॥ **(15 : 7)**

జీవ జగత్తులోని జీవుడు నిశ్చయముగా శాశ్వతమైన నా అంశ (భాగము). మనస్సుతో కలిపి ఆరు (కర్మ) ఇంద్రియములతో భౌతిక ప్రకృతిలో కష్టపడుచున్నాడు.

శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ ।

అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే ॥ **(15 : 9)**

విని, చూసి, స్పర్శ, రుచి, వాసన పొంది మనస్సుతో జీవుడు విషయాన్ని అనుభవిస్తున్నాడు.

ఉత్క్రామంతం స్థితం వాపి భుంజానం నా గుణాన్వితమ్ ।

విమూఢా నానుపశ్యంతి పశ్యంతి జ్ఞానచక్షుషః ॥ **(15 : 10)**

జీవాత్మ శరీరము నందుండి గుణ ప్రభావమున అనుభవించుటగానీ, శరీరమును విడుచుటగానీ అజ్ఞానులు చూడజాలరు. జ్ఞాని చూడగలడు.

యతంతో యోగినశ్చైనం పశ్యంత్యాత్మన్యవస్థితమ్ ।

యతంతో ప్యకృతాత్మానో నైనం పశ్యంత్యచేతసః ॥ **(15 : 11)**

ప్రయత్నించి యోగులు కూడా ఆత్మస్థితులై దీనిని చూడగలరు. ఆత్మానుభూతి లేని అజ్ఞానులు ఎంత ప్రయత్నించినా దీనిని చూడలేరు.

ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేనమ్

ఆశ్చర్యవద్వదతి తథైవ చాన్యః ।

ఆశ్చర్యవచ్చైనమన్యః శృణోతి

శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్ ॥ **(2 : 29)**

ఒకానొకడు ఈ ఆత్మను ఆశ్చర్యముగా చూచును. అట్లే ఇంకొకడు దానిని గూర్చి ఆశ్చర్యమైనదిగా పలుకును. మరొకడు ఈ ఆత్మను ఆశ్చర్యముగా వినును. ఇంకొకడు విని కూడా ఈ ఆత్మను తెలుసుకోలేదు.

## 2.0 మనిషి :

ప్రకృతిలోని అనేక లక్షల జీవ రాశుల్లో మనిషి ఒక జీవరాశి. చలించగల క్రిమి కీటక పశుపక్ష్యాదులలో పశు లేక జంతువు జీవరాశులలో మనిషి ఒక జీవ రాశి. ఆవిధంగా మనిషి ఒక జంతువు. ఇతర జీవరాశులన్నిటికన్నా చాలా ఎక్కువగా వివేకం వలన మనిషి ఒక విశిష్టమైన జీవరాశిగా ఎదిగింది. ఆ ఎక్కువగా గల వివేకానికి మూలం (1) మనిషికి గల పెద్దదైన మెదడు, (2) దానిని ఉపయోగించుకునే విధానం. ఆ విధానమే వైవిధ్యంగల భాష.

భాష వలన వివేకం ఏవిధంగా పెరుగుతుందో చూద్దాం. ఇతర జీవరాశుల్లోని ప్రాణులు చాలా వైవిధ్యంగల భాషను వాడలేకపోవుట వలన వాటి జీవిత కాలంలో స్వయంగా అనుభవించిన విషయాలు మాత్రం తెలుసుకొని ఉపయోగించగలవు. వైవిధ్యం గల భాషను ఉపయోగించే మనిషి తన జీవిత కాలంలో స్వయంగా అనుభవించిన విషయాలేగాక తన పరిధిలోని ఇతరులు అనుభవించిన విషయాలను కూడ వారి నుండి భాషనుపయోగించి తెలుసుకొని ఆ విషయాలను తాను కూడా తన జీవితంలో ఉపయోగించగలడు. ఆ విధంగా భాషను ఉపయోగించిన మనిషి తెలివి పెరిగింది. భాషకు లిపి కూడా తోడైతే ప్రపంచంలో ఎక్కడి వారైనా వారనుభవపూర్వకంగా లేక మరే విధంగానైనా తెలుసుకున్న విషయాలను కూడా లిపినుపయోగించి వ్రాతపూర్వకంగా తెలిపిన విషయాలను ఇతరులు చదివి తెలుసుకొని వారి జీవితాల్లో ఆ విషయాలను ఉపయోగించి చాలా ఎక్కువ విషయాలను తెలుసుకొని ఉపయోగించగలగడం వలన మనిషి భాష, లిపులను ఉపయోగించి ఇతర జీవరాశులకన్నా చాలా ఎక్కువ తెలివైన జీవరాశిగా ఎదగగలిగాడు.

ఏ మనిషైనా ఎంత ఎక్కువ తెలుసుకోగలిగితే అంత ఎక్కువ తెలివైనవాడు కాగలడు. ఎంత ఎక్కువ చదవగలిగితే అంత ఎక్కువ తెలివైనవాడుకాగలడు. అందుచేత విద్య చాలా ముఖ్యమైనది. జంతువుతో సమానంగా ఉండే మనిషిని భాష, విద్య చాలా ఉన్నత స్థాయికి చేర్చింది. అందువల్లనే నారాయణుడు మొదట అక్షరాలను ఏర్పరచి వేదాల్ని, శాస్త్రాలను గానం చేశాడనీ, జ్ఞానం నిక్షిప్తమై ఉన్న వేదాల్ని నేర్చి బ్రహ్మ సృష్టిని జరపగలిగాడనీ, దేవుడు వాక్యమై ఉండెనని మత గ్రంథాల్లో వ్రాశారు. అందువల్ల ఆది కాలం నుంచి వివేకవంతులు జ్ఞానార్జనకు, విద్యకు ఉత్కృష్ట స్థానాన్నిచ్చారు. జ్ఞానార్జనలో మొదటి మెట్టుగా మనిషిని గురించి వివరంగా తెలుసుకోగలిగితే ప్రగతిని, శాంతిని సాధించడానికి చాలా ఉపయోగపడుతుంది.

## 2.1 గుణాలు :

న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః ।
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిః స్యాత్త్రిభిర్గుణైః ॥ **(18 : 40)**

భూమి, ఆకాశం, దేవతలు, లేక ఏ ఇతర లోకాలలోనైనా ప్రకృతి నుండి ఉత్పన్నమైన మూడు గుణాలు లేకుండా ఏ ప్రాణి ఉండదు.

సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః ।
నిబధ్నంతి మహాబాహో దేహే దేహినమవ్యయమ్ ॥ **(14 : 5)**

ప్రకృతిలో సత్త్వరజస్తమో గుణాలు ఉన్నవి. ఇవి శాశ్వతమైన జీవుని శరీరంలో బంధిస్తున్నవి.

శరీరంలోని పురుషుడు ప్రకృతిలోని ఘటనల వలన సుఖదుఃఖాలను అనుభవించినపుడు పరిస్థితుల ఆధారంగా శరీర తత్వంలోని సత్వ, రజ, తమో గుణాల ప్రభావముల ననుసరించి స్పందించి పనులు చేయుటకు నిశ్చయించుకొనును. ఆ విధంగా త్రిగుణాలు జీవుని శరీరములో బంధిస్తున్నాయి.

తత్ర సత్త్వం నిర్మలత్వాత్ ప్రకాశకమనామయమ్ ।
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ ॥ **(14 : 6)**

సత్వ గుణము నిర్మలము, ప్రకాశవంతమై వికారాలు కలిగించనిది. అది సుఖాలు, జ్ఞానములపై ఆసక్తితో (జీవుని) బంధించును.

రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగసముద్భవమ్ ।
తన్నిబధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినమ్ ॥ **(14 : 7)**

రజోగుణము కోరికలు ఆశల వలన పుట్టినది. అది జీవుని పనులు, వాటి ఫలితాలతో బంధించును.

తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్ ।
ప్రమాదాలస్యనిద్రాభిః తన్నిబధ్నాతి భారత ॥ **(14 : 8)**

అజ్ఞానము వలన పుట్టిన తమోగుణము సకల జీవులను మోహితులనుగా చేయును. అది బుద్ధిహీనత, సోమరితనం, నిద్రలతో బంధించును.

సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత ।
జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సంజయత్యుత ॥ **(14 : 9)**

సత్వ గుణము సుఖములందు, రజోగుణము పనులలోను, తమో గుణము జ్ఞానాన్ని కప్పివేసి, ప్రమాదాలలో బంధించునని చెప్పబడింది.

రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత ।
రజఃసత్త్వం తమశ్చైవ తమః సత్త్వం రజస్తథా ॥ **(14 : 10)**

రజస్తమోగుణాలను అణచి సత్త్వ గుణము వృద్ధిచెందును. అదేవిధంగా సత్త్వతమోగుణాలను అణచి రజోగుణము, సత్త్వరజోగుణాలను అణచి తమో గుణము వృద్ధి చెందును.

శరీర, పరిసర పరిస్థితులను అనుసరించి త్రిగుణాలలో ఏదో ఒక గుణము వృద్ధి చెందుతుంది.

సర్వద్వారేషు దేహే స్మిన్ ప్రకాశ ఉపజాయతే ।

జ్ఞానం యదా తదా విద్యాత్ వివృద్ధం సత్త్వమిత్యుత ॥ **(14 : 11)**

ఎప్పుడు మనిషి చేసే పనులన్నీ జ్ఞానంతో తేజోవంతమై ఉంటవో అప్పుడు సత్త్వ గుణము వృద్ధినొంది ఉన్నట్లుగా తెలుసుకొమ్మని చెప్పబడింది.

లోభః ప్రవృత్తిరారంభః కర్మణామశమః స్పృహా

రజస్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ ॥ **(14 : 12)**

రజోగుణము అధికమైనప్పుడు లోభము, అణచలేని కోరిక, పనుల ప్రయత్నము, క్రియాశీలత్వము వృద్ధినొందును.

అప్రకాశో ప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ ।

తమస్యేతాని జాయంతే వివృద్ధే కురునందన ॥ **(14 : 13)**

తమో గుణము వృద్ధినొందగా నిస్తేజం, సోమరితనం, బుద్ధి హీనత, మోహము వ్యక్తములగును.

సత్త్వాత్ సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ ।

ప్రమాదమోహౌ తమసో భవతో జ్ఞానమేవ చ ॥ **(14 : 17)**

సత్త్వ గుణమునుండి జ్ఞానము పెంపొందును. రజో గుణము నుండి లోభము, తమో గుణము నుండి బుద్ధి హీనత, మోహము, అజ్ఞానము తప్పక ఉత్పన్నమగును.

## 2.2 గుణాలు – ఆహారం :

ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః ।

యజ్ఞస్తపస్తథా దానం తేషాం భేదమిమం శృణు ॥ **(17 : 7)**

అందరికీ ఇష్టమైన ఆహారం కూడా మూడు విధాలుగా ఉండును. అట్లే యజ్ఞము, దానము, తపస్సులు కూడా మూడు విధాలుగా ఉండును.

ఆయుఃసత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః ।

రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యాః ఆహారాః సాత్త్వికప్రియాః ॥ **(17 : 8)**

ఆయువు, బుద్ధి, బలము, ఆరోగ్యము, సుఖము, ప్రీతిని వృద్ధిపరుచునట్టి రసవంతములు, పుష్టికరము, దృఢము, మనః ప్రీతిని కలిగించు ఆహారములు సత్త్వగుణమధికముగా ఉన్నవారికి ఇష్టమైనవి.

కట్వమ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః ।

ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః ॥ **(17 : 9)**

చేదు, పులుపు, ఉప్పు, కారం రుచులు, మిక్కిలి వేడిగా ఉన్నట్టివి, ఎండినవి, మంట కలిగించునట్టి ఆహారములు రజోగుణము ఎక్కువగా ఉన్నవారికి ఇష్టము. అవి దుఃఖము, చింత, రోగములు కలిగించును.

యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్ ।

ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్ ॥ **(17 : 10)**

తినడానికి బాగా ముందు వండినవి, రుచిలేనివి, చెడు వాసన కలిగి కుళ్ళినట్టివి, వేరొకరు తిని వదిలినవి, నిషిద్ధ పదార్థాలు తమో గుణం ఎక్కువగా ఉన్నవారికి ఇష్టం.

### 2.3 గుణాలు – జ్ఞానము :

సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే ।

అవిభక్తం విభక్తేషు తద్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ ॥ **(18 : 20)**

విభజింపబడిన సర్వప్రాణుల యందు అవిభక్తమైన నాశనము లేని ఒకే భావాన్ని (పరమాత్మ) ఏ జ్ఞానముతో చూచునో ఆ జ్ఞానము సాత్త్విక జ్ఞానముగా తెలుసుకో.

పృథక్త్వేన తు యద్ జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్ ।

వేత్తి సర్వేషు భూతేషు తద్ జ్ఞానం విద్ధి రాజసమ్ ॥ **(18 : 21)**

ఏ జ్ఞానము వలన విభిన్న శరీరములలోనున్న భావాన్ని విభిన్న ప్రాణులుగా తెలుసుకొనునో ఆ జ్ఞానము రజోగుణ సంబంధమైనదిగా తెలుసుకో.

యత్తు కృత్స్నవదేకస్మిన్ కార్యే సక్తమహైతుకమ్ ।

అతత్త్వార్థవదల్పం చ తత్తామసముదాహృతమ్ ॥ **(18 : 22)**

కారణం లేకుండా తత్త్వార్థరహితంగా అల్పమైన ఒక పనిలో అదే సర్వస్వమైనట్లు ఆసక్తితో ఏ జ్ఞానము వలన ఉండునో అది తమో గుణ సంబంధమైనదిగా చెప్పబడింది.

### 2.4 గుణాలు – బుద్ధి :

ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే ।

బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధిః సా పార్థ సాత్త్వికీ ॥ **(18 : 30)**

చేయవలసినది, చేయరానిది, చేయుట, చేయకపోవుట, భయము, నిర్భయము, బంధ మోక్షాన్ని తెలుసుకునేది సాత్త్విక బుద్ధి.

యయా ధర్మమధర్మం చ కార్యం చాకార్యమేవ చ ।

అయథావత్ ప్రజానాతి బుద్ధిః సా పార్త రాజసీ ॥ **(18 : 31)**

ధర్మాధర్మములను, చేయదగినది, చేయదగనిది సరిగా తెలుసుకోలేని బుద్ధిని రాజస బుద్ధి అందురు.

అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా ।

సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధిః సా పార్థ తామసీ ॥ **(18 : 32)**

భ్రాంతిచే కప్పబడి అధర్మాన్ని ధర్మంగాను, అన్ని విషయాలను తప్పు విధంగా భావించేది తామస బుద్ధి.

### 2.5 గుణాలు – ధృతి (నిశ్చయము) :

ధృత్యా యయా ధారయతే మనఃప్రాణేంద్రియ క్రియాః॥

యోగేనావ్యభిచారిణ్యా ధృతిః సా పార్థ సాత్త్వికీ ॥ **(18 : 33)**

అంతరాయము లేని యోగాభ్యాసముచే మనస్సు, ప్రాణము, ఇంద్రియముల పనులను నియంత్రించు నిశ్చయమును 'సాత్త్విక ధృతి' అందురు.

యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేర్జున ।

ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతిః సా పార్థ రాజసీ ॥ **(18 : 34)**

కాని ఏ నిశ్చయముతో ధర్మార్థకామ విషయాలలో ఫలాపేక్ష కలిగివుండునో ఆ నిశ్చయమును 'రాజస ధృతి' అందురు.

యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ ।

న విముంచతి దుర్మేధా ధృతిః సా పార్థ తామసీ ॥ **(18 : 35)**

కలలతో కూడిన నిద్ర, భయము, దుఃఖము, మదము, చింతలను వదలని చెడు బుద్ధి కలవాని నిశ్చయమును 'తామస ధృతి' అందురు.

## 2.6 గుణాలు – సుఖాలు :

సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ ।

అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాంతం చ నిగచ్ఛతి ॥ **(18 : 36)**

యత్తదగ్రే విషమివ పరిణామేమృతోపమమ్ ।

తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమ్ ఆత్మబుద్ధిప్రసాదజమ్ ॥ **(18 : 37)**

ఇక మూడు విధములగు సుఖములను వినుము. వానిలో సుఖములను అనుభవించుట, దుఃఖాంతము (మోక్ష మార్గము) పొందుట కూడా జరుగును. ఆరంభమున విషమువలెనున్నను చివరలో బుద్ధినుండి పుట్టిన ఆత్మ జ్ఞానము వలన కలిగిన అమృతముతో సమానమైనట్టిది 'సాత్త్విక సుఖ'మనబడును.

విషయేంద్రియసంయోగాత్ యత్తదగ్రేమృతోపమమ్ ।

పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥ **(18 : 38)**

ఇంద్రియార్థములు ఇంద్రియములతో కలియుట వలన కలుగు సుఖము మొదట అమృతముతో సమానముగను చివర విషమువలెను ఉండును. అట్టి సుఖము రజోగుణముతో కూడినదని భావింపబడును.

యదగ్రే చానుబంధే చ సుఖం మోహనమాత్మనః ।

నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్ ॥ **(18 : 39)**

నిద్ర, సోమరితనం, మోహముల వలన కలిగి మొదటినుంచి చివరి వరకు ఆత్మను అదే సుఖమనిపించే భ్రాంతిలో ఉంచేది 'తామస సుఖము'.

## 2.7 భావాలు :

బుద్ధిః జ్ఞానమసమ్మోహః క్షమా సత్యం దమః శమః ।

సుఖం దు:ఖం భవో భావో భయం చాభయమేవ చ ॥ **(10 : 4)**

అహింసా సమతా తుష్టిః తపో దానం యశో యశః ।

భవంతి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః ॥ **(10 : 5)**

బుద్ధి, జ్ఞానము, భ్రాంతి లేకుండుట, క్షమా గుణము, సత్యము, ఇంద్రియ నిగ్రహము, మనోనిగ్రహము, సుఖము, దు:ఖము, పుట్టుక, మరణము, భయము, నిర్భయము, అహింస, సమభావం, తృప్తి, తపస్సు, దానము, కీర్తి, అపకీర్తి మున్నగు వివిధ భావములు జీవులకు నానుండియే కలుగుతున్నవి.

## 3.0.0 కర్మ :

న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ।

కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః ॥ **(3 : 5)**

ఎవరైనను ఎప్పుడైనా ఒక క్షణ కాలమైనా ఏదో ఒక పని చేయకుండా నిశ్చయంగా ఉండదు.అందరూ నిశ్చయంగా ప్రకృతి జనిత త్రిగుణాలచే తన వశము లేని వాడై పని చేయునట్లు ప్రేరేపించబడుచుందురు.

కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।

ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారః స ఉచ్యతే ॥ **(3 : 6)**

ఐదు కర్మేంద్రియాలను నిగ్రహించి మనస్సుచే ఇంద్రియ విషయాలను తలుస్తుండే మూఢుని మిథ్యాచారి అంటారు.

నియతం సంగరహితమ్ అరాగద్వేషతః కృతమ్ ।

అఫలప్రేప్సునా కర్మ యత్తత్ సాత్త్వికముచ్యతే ॥ **(18 : 23)**

ఏ పని క్రమబద్ధమై కర్తృత్వాభిమానము లేనివానిచే ఇష్టాయిష్టాలు లేకుండా ఫలితం కోరనివానిచే చేయబడుతుందో అది 'సాత్త్విక కర్మ' అనబడును.

యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః ।

క్రియతే బహుళాయాసం తద్రాజసముదాహృతమ్ ॥ **(18 : 24)**

ఏ పని ఫలము కోరేవానిచే అహంకారముతో అధిక ప్రయాసతో లేక మరల చేయబడుతుందో అది 'రాజస కర్మ' అనబడును.

అనుబంధం క్షయం హింసామ్ అనవేక్ష్యచ పౌరుషమ్ ।

మోహాదారభ్యతే కర్మ యత్తత్ తామసముచ్యతే ॥ **(18 : 25)**

ఏ పని ఎవరిదనిగాని దానివలన కలిగే నాశము, హింస, పరిణామాలుగానీ సామర్థ్యమునుగానీ తెలుసుకోకుండా భ్రాంతితో ఆరంభింపబడునో అది 'తామస కర్మ' అనబడును.

## 3.0.1 కర్మ సిద్ధి :

పంచైతాని మహాబాహో కారణాని నిబోధ మే ।

సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్ ॥ **(18 : 13)**

సాంఖ్య శాస్త్రములో ఉపసంహారమున చెప్పబడిన అన్ని పనుల సిద్ధికి గల ఐదు కారణములను నానుండి తెలుసుకో.

అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్ ।

వివిధాశ్చ పృథక్ చేష్టా దైవం చైవాత్ర పంచమమ్ ॥ **(18 : 14)**

అధిష్ఠానము, కర్త, సాధనములు, విభిన్న విధములైన పలు చేష్టలు, దైవము కూడా ఐదు కారణములు.

పని చేయించువారు, చేయువారు, పని చేయుటకు ఉపయోగపడే సాధనములు, కార్యాచరణములోని పలు చేష్టలు, దైవము కార్యసిద్ధికి కారణములు.

శరీరవాఙ్మనోభిర్యత్ కర్మ ప్రారభతే నరః ।

న్యాయం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః ॥ **(18 : 15)**

మానవుడు మనస్సు, వాక్కు, శరీరములతో ఆరంభించు ఏ పని అయినా అది న్యాయమైనదైనా దానికి విపరీతమైనదైనా ఆ పని సిద్ధించడానికి ఈ ఐదును దానికి కారణములు.

## 3.0.2 కర్మ ప్రేరణలు :

జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా ।

కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః ॥ **(18 : 18)**

జ్ఞాన లక్ష్యము, దానికి సంబంధించిన జ్ఞానము, ఆ జ్ఞానమునెరిగినవాడు ఈ మూడు పనికి ప్రేరణలు. పని, సాధనము, పనిచేయువాడు (కర్త) పని యొక్క మూడు అంశములు.

## 3.0.3 కర్త :

తత్రైవం సతి కర్తారమ్ ఆత్మానం కేవలం తు యః ।

పశ్యత్యకృతబుద్ధిత్వాత్ న స పశ్యతి దుర్మతిః ॥ **(18 : 16)**

ఏ పనైనా పూర్తవడానికి ఐదు కారణములైనప్పటికినీ కేవలం ఆత్మ లేక తానే కర్తగా వివేకహీనుడై భావించువాడు నిజాన్ని తెలుసుకోలేడు.

యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే ।

హత్వాపి స ఇమాన్ లోకాన్ న హంతి న నిబధ్యతే ॥ **(18 : 17)**

అహంకారము లేనివాడు, ఆసక్తి లేని బుద్ధి కలవాడు ఈ లోకంలో చంపినను హంతకుడు కాడు. కర్మ బంధంలో చిక్కుకొనడు.

ముక్తసంగో నహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః ।

సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే ॥ **(18 : 26)**

ఆసక్తి లేనివాడు, అహంకారము లేనివాడు, నిశ్చయము ఉత్సాహము కలవాడు జయాపజయాలలో ఎటువంటి వికారము లేనివాడు 'సాత్త్విక కర్త' అనబడును.

రాగీ కర్మఫలప్రేప్సుః లుబ్ధో హింసాత్మకో శుచిః ।

హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః ॥ **(18 : 27)**

ఆసక్తి కలవాడు, కర్మఫలం కోరువాడు, లోభి, హింసించేవాడు, అపరిశుద్ధుడు, సంతోషము-దుఃఖములకు లోనగువాడు అయిన కర్త 'రాజస కర్త' అనబడును.

ఆయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికోలసః ।

విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే ॥ **(18 : 28)**

ఉన్న పనికి సరిపడనివాడు (సుశిక్షితుడు కానివాడు), భౌతికంగా మాత్రమే చేయగలిగినవాడు, మొండివాడు, ధూర్తుడు, పనికి అడ్డుతగిలేవాడు, సోమరి, చింతించేవాడు, కాలాయాపన చేసేవాడు, 'తామస కర్త' అనబడును.

## 3.1.0 పాప కర్మాచరణ :

13:2లో అన్న దేహాలలోని క్షేత్రజ్ఞుడు కూడా తానేనని పరమాత్మ తెలిపియున్నాడు. 13:20లో జీవాత్మ సుఖదుఃఖములను అనుభవించునని తెలిపియున్నాడు. అందువలన ఎవరైనా మరొక ప్రాణికి దుఃఖము కలిగించిన యెడల సకల జీవులను భరించి పోషించుచున్నట్టి పరమాత్మకు ద్రోహము చేసిన వారగుదురు. వారు పాపమును పొందెదరు. అదేవిధంగా మరొక ప్రాణికి సుఖ సంతోషాలను కలిగించెడివారు పుణ్యమును పొందెదరు.

పాపముల వలన బుద్ధి నశించి వివేకహీనుడై కష్టములను పొందును. జీవితంలో కష్టములకు కారణము పాపములు. కష్టములు లేని జీవితము కొరకు పాపములు చేయకుండా ఉండవలెను.

అథకేన ప్రయుక్తోయం పాపం చరతి పూరుషః ।

అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదిన నియోజితః ॥ **(3 : 36)**

తనకిష్టము లేకపోయినప్పటికినీ బలవంతముగా నియోగింపబడినవాని వలె మానవుడు దేనిచే ప్రేరేపితుడై పాపమును చేయును?

కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః ।

మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్ ॥ **(3 : 37)**

రజోగుణము నుండి ఉత్పన్నమై పిదప క్రోధముగా పరిణమించు కామము ఈ భౌతిక ప్రపంచమునందు సర్వమును మ్రింగునట్టి పాపకర్మల ప్రేరకము, పరమ శత్రువు.

ధూమేనావ్రియతే వహ్నిః యథాదర్శో మలేన చ ।
యథోల్బేనావృతో గర్భః తథా తేనేదమావృతమ్ ॥ **(3 : 38)**

పొగ చేత అగ్ని, ధూళిచే అద్దము, మావిచే పిండము వలెనే కామముచే ఇది (మనిషి జ్ఞానము) కప్పబడియుండును.

ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా ।
కామరూపేణ కౌంతేయ దుష్పూరేణానలేన చ ॥ **(3 : 39)**

జ్ఞానవంతుని జ్ఞానము ఈ కామమనెడి నిత్య శత్రువుచే కప్పబడియుండును. కామ రూపమున ఉన్న అగ్ని తృప్తిపరుచుటకు శక్యము కానటువంటిది.

ఇంద్రియాణి మనో బుద్ధిః అస్యాధిష్ఠానముచ్యతే ।
ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్ ॥ **(3 : 40)**

ఇంద్రియములు, మనస్సు, బుద్ధి కామమునకు నివాస స్థానములు. వీనిచే ఈ కామము జ్ఞానమును కప్పివేసి జీవులను మోహితులుగా చేయును.

ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే ।
సంగాత్ సంజాయతే కామః కామాత్ క్రోధోభిజాయతే ॥ **(2 : 62)**

విషయముల గూర్చి చింతన చేయువానికి ఆ విషయములలో ఆసక్తి ఏర్పడును. ఆసక్తి నుండి కోరిక కలుగును. కోరిక వలన కోపము కలుగును.

క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః ।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి ॥ **(2 : 63)**

క్రోధము వలన వ్యామోహము, దానివలన జ్ఞాపక శక్తి తగ్గి దానివలన బుద్ధి నశించి పతనమగును.

### 3.1.1 నిగ్రహము :

పాపములు చేయకుండుటకు చెడు కోర్కెలను నిగ్రహించవలెను.

ఇంద్రియస్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।
తయోర్న వశమాగచ్ఛేత్ తౌ హ్యస్య పరిపంథినౌ ॥ **(3 : 34)**

ప్రతి ఇంద్రియ విషయములయందును ఇష్టాయిష్టాలు దాగివున్నవి. మానవుడు వాటి వశము కారాదు. ఇష్టాయిష్టాలే అతని అభివృద్ధికి ఆటంకాలు.

తస్మాత్ త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ ।
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్ ॥ **(3 : 41)**

అందుచేత మొదట ఇంద్రియములను వశపరుచుకొని జ్ఞాన విజ్ఞానమును నశింపజేయునట్టి మహా పాప చిహ్నమైన కామమును నిరోధింపుము.

ఇంద్రియాణి పరాణ్యాహుః ఇంద్రియేభ్యః పరం మనః ।
మనసస్తు పరా బుద్ధిః యో బుద్ధేః పరతస్తు సః ॥ **(3 : 42)**

(శరీరంలో) ఇంద్రియములు ఉత్తమములు. వాటికన్నా మనస్సు ఉత్తమము. దానికన్నా బుద్ధి, దానికన్నను ఆత్మ అత్యుత్తమము.

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా ।

జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్ ॥ **(3 : 43)**

ఉత్తమమైన బుద్ధిచే మనస్సును స్థిరపరచి దుర్జయమైన కామమనెడి శత్రువును జయింపుము.

## 3.2.0 సకామ కర్మ :

వ్యవసాయాత్మికా బుద్ధిః ఏకేహ కురునందన ।

బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయో వ్యవసాయినామ్ ॥ **(2 : 41)**

కర్మ యోగి బుద్ధి ఒకే దిశలో స్థిరమై ఉంటుంది. సకామకర్మ చేయువాని బుద్ధి అనేక శాఖలు కలిగిన అసంఖ్యాకములైన దిశలలో ఉంటుంది.

తన ఆడంబరములకై కాక పరమాత్ముని సేవకైగాని, లోక కళ్యాణముకైగాని పనులు చేయువారి బుద్ధి ఒకే దిశలో స్థిరమై ఉంటుంది. తన ఆడంబరపు కోర్కెల కొరకు పనులు చేయువాని బుద్ధి అనేక దిశలలో ఆలోచనలను రేపుతుంది.వానికి జీవితంలో స్థిరమైన గమ్యముండదు. వాని జీవితము అర్థములేనిదిగా వ్యర్థమగును.

యామిమాం పుష్పితాం వాచం ప్రవదంత్యవిపశ్చితః ।

వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః ॥ **(2 : 42)**

కామాత్మానః స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్ ।

క్రియావిశేషబహులాం భోగైశ్వర్యగతిం ప్రతి ॥ **(2 : 43)**

స్వర్గము, సుఖాలు, భోగాలు, ఐశ్వర్యాల కొరకు, పనులు ఫలప్రదమవడానికి, పలు విధములైన కర్మలతో కూడిన వేద వాక్కులను మించినవి లేవని అల్పజ్ఞానులు వాదింతురు.

భోగైశ్వర్యప్రసక్తానాం తయాపహృతచేతసామ్ ।

వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే ॥ **(2 : 44)**

మోహగ్రస్తమైన మనస్సులు కలిగి భోగైశ్వర్యాలలో ఆసక్తులైనవారికి భగవధ్యానమునందు నిశ్చయాత్మక బుద్ధి కలుగదు.

కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః ।

క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా ॥ **(4 : 12)**

పనులు సిద్ధించాలనే కోరికతో ఈ ప్రపంచంలో దేవతలను యజ్ఞముతో పూజించి మానవ లోకంలో కోరికతో చేసే పనుల నుండి శీఘ్రంగా జయము కలుగును.

## 3.2.1 శ్రద్ధ :

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత ।

శ్రద్ధామయోయం పురుషో యో యచ్ఛ్రద్ధః స ఏవ సః ॥ **(17 : 3)**

మనుషులందరి శ్రద్ధ వారి అంతఃకరణననుసరించి ఉంటుంది. మనిషి ప్రవర్తనను గమనించి అతడు ఎటువంటి శ్రద్ధ కలవాడో తెలుసుకోవచ్చు.

త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా ।

సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు ॥ **(17 : 2)**

దేహధారుల స్వభావాన్ననుసరించి వారి శ్రద్ధ సాత్త్వికము, రాజసము, తామసము అని మూడు విధాలుగా ఉన్నది.

యజంతే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః ।

ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజంతే తామసా జనాః ॥ **(17 : 4)**

జనులలో సాత్త్వికులు దేవతలను, రాజసులు యక్ష రాక్షసులను, తామసులు భూత ప్రేత గణాల్ని పూజిస్తారు.

అశాస్త్రవిహితం ఘోరం తప్యంతే యే తపో జనాః ।

దంభాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః ॥ **(17 : 5)**

కర్శయంతః శరీరస్థం భూతగ్రామమచేతసః ।

మాం చైవాంతఃశరీరస్థం తాన్ విద్ధ్యాసురనిశ్చయాన్ ॥ **(17 : 6)**

శాస్త్రము తెలుపనట్టి తీవ్రమైన తపస్సులను చేయువారు గర్వము, అహంకారము, ఉండి కామాసక్తితో ప్రేరితులై శరీరమునందున్న భూత సముదాయమును బాధపెట్టుచూ పెడదారిపట్టిన మనసు కలవారై దేహాంతర్యామిని కూడా కృశింపజేయు అసురులని తెలుసుకో.

మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః ।

రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః ॥ **(9 : 12)**

వ్యర్థములైన ఆశలు, జ్ఞానము కలిగి వ్యర్థ చేష్టలు చేయువారు రాక్షసీ, మోహినీ, అసరీ స్వభావాన్ని ఆశ్రయిస్తారు.

కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేన్యదేవతాః ।

తం తం నియమమాస్థాయి ప్రకృత్యా నియతాః స్వయా ॥ **(7 : 20)**

తమ ప్రకృతిచే నిర్దేశించబడినవారై కోరికలచే జ్ఞానము నశించి కోరికలకనుగుణమైన ఇతర దేవతలను శరణుజొచ్చి తదనుగుణమైన నియమమును అనుసరింతురు.

యో యో యాం యాం తమం భక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి ।

తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్ ॥ **(7 : 21)**

ఎవరెవరు ఏయే దేవతారూపములను భక్తిశ్రద్ధలతో పూజింపగోరునో వారందరికీ ఆయా దేవతలయందు స్థిరమైన శ్రద్ధను ఇచ్చెదను.

స తయా శ్రద్ధయా యుక్తః తస్యారాధనమీహతే ।

లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హి తాన్ ॥ **(7 : 22)**

అతడుఅట్టి శ్రద్ధతో ఆ దేవతను ఆరాధించి తాను కోరినవి పొందును. అవి నా చేతనే ఒసగబడుచున్నవి.

అంతవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్ ।

దేవాన్ దేవయజో యాంతి మద్భక్తా యాంతి మామపి ॥ **(7 : 23)**

కాని అట్టి అల్పబుద్ధులు పొందు ఫలము అశాశ్వతమైనది. దేవతలను పూజించువారు దేవతలను పొందుదురు. నా భక్తులు నన్నే పొందుదురు.

అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యంతే మామబుద్ధయః ।

పరం భావమజానంతో మమావ్యయమనుత్తమమ్ ॥ **(7 : 24)**

నాశము లేని అత్యుత్తమమైన నా దివ్య స్థితిని తెలియనివారైన మందబుద్ధులు నన్ను అవ్యక్తమునుండి స్వరూపమును పొందినవానిగా తలంతురు.

నాహం ప్రకాశః సర్వస్య యోగమాయాసమావృతః ।

మూఢోయంనాభిజానాతి లోకో మామజమవ్యయమ్ ॥ **(7 : 25)**

నా యోగ మాయచే కప్పబడియుండి అందరికినీ నేను వ్యక్తుడను కాను. మూఢులు నేను నాశము, పుట్టుక లేనివానినని తెలుసుకోలేరు.

యేప్యన్యదేవతా భక్తా యజంతే శ్రద్ధయాన్వితాః ।

తేపి మామేవ కౌంతేయ యజంత్యవిధిపూర్వకమ్ ॥ **(9 : 23)**

ఇతర దేవతల భక్తులు ఎవరు శ్రద్ధతో ఆ దేవతలను పూజింతురో వారు అవిధిగా నన్నే పూజిస్తున్నారు.

అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ ।

న తు మామభిజానంతి తత్త్వేనాతశ్చ్యవంతి తే ॥ **(9 : 24)**

నేనే అన్ని యజ్ఞములకు భోక్తను, ప్రభువునుకూడా. వారు నా తత్త్వమునెరుగక పతనమగుదురు (ముక్తినొందరు).

మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః ।

భజంత్యనన్యమనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్ ॥ **(9 : 13)**

మహాత్ములు దైవీ ప్రకృతిని ఆశ్రయించి నన్ను సకల భూతములకు (ప్రకృతి, ప్రాణులు) మూలముగాను అంతములేనివానిగాను తెలుసుకొని మనస్సును నాయందే లగ్నము చేసి భజింతురు.

ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః ।

బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా ॥ **(17 : 23)**

ఓం, తత్, సత్ అను మూడు శబ్దాలు పరమాత్మకు నిర్దేశించబడినవిగా భావింపబడినవి. గతంలో బ్రాహ్మణులు వానిని యజ్ఞములు, వేదములలో కూడా ఉపయోగించిరి.

తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియా ।

ప్రవర్తంతే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్ ॥ **(17 : 24)**

అందుచే ఎల్లప్పుడునూ వేదములను పఠించువాడిచే యజ్ఞము, దానము, తపస్సులు ఓంకారంతో ప్రారంభించబడుచున్నవి.

తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞతపఃక్రియాః ।

దానక్రియాశ్చ వివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః ॥ **(17 : 25)**

మోక్షమును కోరిన వారిచే వివిధ యజ్ఞ దాన తపస్సులను ఫలాపేక్ష లేకుండా 'తత్' అనుచూ చేయబడుచున్నవి.

సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే ।

ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే ॥ **(17 : 26)**

పరమాత్మ నిత్యుడు, శ్రేష్ఠుడు అను భావములందు 'సత్' అను శబ్దము ఉపయోగించబడును. అట్లే ఉత్తమ కార్యాచరణలో 'సత్' అను శబ్దము ఉపయోగించబడును.

యజ్ఞే తపసి దానే చ స్థితిః సదితి చోచ్యతే ।

కర్మ చైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే ॥ **(17 : 27)**

యజ్ఞ, దాన, తపస్సులలోని ఆస్తిక భావమును 'సత్' అందురు. ఆ భావము గల పరమాత్ముని సేవలకు సంబంధించిన పనులను కూడా 'సత్' అంటారు.

అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్ ।

అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ ॥ **(17 : 28)**

అశ్రద్ధతో చేసిన హోమము, దానము, తపస్సులను 'అసత్' అందురు. దానివలన ఈ జీవితంలోగానీ మరణించి తరువాతగానీ ప్రయోజనముండదు.

అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే ।

యష్టవ్యమేవేతి మనః సమాధాయ స సాత్త్వికః ॥ **(17 : 11)**

మనస్సున కర్తవ్యంగా భావించి ఫలాపేక్ష లేకుండా శాస్త్రానుసారము చేయబడు యజ్ఞము 'సాత్త్విక యజ్ఞము'.

అభిసంధాయ తు ఫలం దంభార్థమపి చైవ యత్ ।

ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్ ॥ **(17 : 12)**

ఫలాపేక్షతోగానీ ఆడంబరము కొరకుగానీ చేయబడు యజ్ఞము 'రాజస యజ్ఞము'.

విధిహీనమసృష్టాన్నం మంత్రహీనమదక్షిణమ్ ।

శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే ॥ **(17 : 13)**

శాస్త్రానుసారం కానిది, అన్నదానం (ప్రసాదం) లేనిది, సరిగా మంత్రాలు లేనిది, దక్షిణ లేనిది, శ్రద్ధ లేనిది, అయిన యజ్ఞమును 'తామస యజ్ఞము' అని భావింతురు.

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్ ।

స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥ **(3 : 35)**

చక్కగా ఆచరింపబడిన పరధర్మముకంటే గుణము లేనిదైనా స్వధర్మమే మేలు. పరధర్మము హానికరము. స్వధర్మాచరణతో మరణమే మేలు.

### 3.2.2 దానాలు :

దాతవ్యమితి యద్దానం దీయతేనుపకారిణే ।

దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్ ॥ **(17 : 20)**

ప్రతిఫలాన్ని ఆశించకుండా దానానికి అర్హులైన వానికి దానానికి అవసరమైన దేశకాల పరిస్థితులలో కర్తవ్యముగా భావించి ఇచ్చు దానము 'సాత్త్విక దానము'.

యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః ।

దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్ ॥ **(17 : 21)**

ప్రతిఫలాన్ని ఆశించిగానీ, ఫలితాన్ని ఆశించిగానీ, ఇష్టం లేకుండా గానీ ఇచ్చు దానము 'రాజస దానము'.

అదేశకాలే యద్దానమ్ అపాత్రేభ్యశ్చ దీయతే ।

అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతమ్ ॥ **(17 : 22)**

దానము అవసరములేని దేశకాల పరిస్థితుల యందు అర్హతలేని వానికి గౌరవము, శ్రద్ధ లేకుండా ఇచ్చు దానము 'తామస దానము'.

మనుషుల శ్రద్ధ, ఆరాధన పైన చెప్పిన విధంగా అనేక విధాలుగా ఉన్నాయి. పైన చెప్పిన వాటిలో కాల గమనంలో కొన్ని సమసిపోయాయి. కొన్ని కొత్త విధాలు వచ్చినాయి. ఆనాటి కాలంలోఉన్న యక్ష, రాక్షస, అసుర, మోహినీ స్వభావాలను ఆశ్రయించే వారిపుడు దాదాపుగా లేరనే చెప్పాలి. అక్కడక్కడ భూత, ప్రేత గణాల్ని ఆచరించేవారు చాలా తక్కువ మంది

ఇప్పటికీ ఉన్నారు.రోమన్ సామ్రాజ్యంలో సుమారు 2000 సంవత్సరాల క్రితం ప్రజలందరినీ క్రీస్తునారాధించే ఒక కొత్త మతాన్నవలంబింపజేసి రోమన్ సామ్రాజ్య ప్రజలందరిలో మతపరంగా ఐకమత్యాన్ని సాధించారు. పశ్చిమాసియాలో మహమ్మద్ ప్రవక్త ఇస్లామ్ మతాన్ని స్థాపించి దాని ద్వారా ప్రజలలో ఐకమత్యాన్ని పెంపొందించి ఒక సామ్రాజ్యాన్ని స్థాపించాడు. పైన చెప్పిన వాటిలో మతాలతోపాటు పటిష్టమైన మత వ్యవస్థలు (ఆర్గనైజేషన్స్) ఏర్పడ్డాయి. అవి ప్రజలందరికీ మత బోధ చేసి ప్రజలందరి చేత మతాన్నవలవంబింపజేసి మతపరంగా ప్రజల్లో ఐకమత్యం, నిర్దిష్టమైన నడవడిక కలిగివుండేట్లు చేశాయి.

హిందుస్థానంలో మౌర్య సామ్రాజ్యంలో బౌద్ధమతం ప్రోత్సహించబడింది. తరువాత వచ్చిన గుప్త సామ్రాజ్యం హిందూ మతాన్ని ప్రోత్సహించింది. ఆది శంకరాచార్యులవారు హిందుస్థానమంతటా హిందూమతాన్ని వ్యాపింపజేసి నాలుగు దిక్కులా నాలుగు పీఠాలనేర్పరచి హిందూ మత వ్యవస్థకు నాంది పలికి మతపరంగా హిందూస్థానంలో ఐకమత్యానికి కృషిచేశారు.వారి తరువాత అటువంటి కృషిచేసిన వారెవరూ లేరు. వ్యవస్థలోని లోపాలు అప్పటికే సామ్రాజ్యం విచ్ఛిన్నమైన కారణాల వలన హిందూస్థానంలో ఐకమత్యమేర్పడలేదు. ఆ అనైక్యత వలన హిందూస్థానం సుమారు ఒక వేయి సంవత్సరాలు విదేశీయుల పాలనలో అనేక కష్టనష్టాలపాలయింది.

విదేశీయులు అనేక దేవాలయాలను ధ్వంసం చేశారు. స్త్రీలు, పురుషులు, వృద్ధులు, పిల్లలు అని విచక్షణ లేకుండా నాలుగు గోడల మధ్య నిర్దాక్షిణ్యంగా అన్యాయంగా కాల్చి చంపారు. వ్యవసాయాన్ని, పరిశ్రమలను నాశనం చేశారు. సంపదను కొల్లగొట్టుకుపోయారు. ప్రజలను కూడు, గుడ్డ, గూడు లేని బీదరికంలో ముంచేశారు.

చక్కగా ఆచరించబడిన పరధర్మముకన్నా గుణము లేనిదైనా స్వధర్మాచరణే శ్రేయస్కరమైనది.పరధర్మము భయంకరమైనది (3:35).అందుకనే అంబేద్కర్ గారు స్వదేశీమతమైన బౌద్ధ మతాన్నవలంబించారుగానీ విదేశీ మతాన్ని అవలంబించలేదు. సామ్రాజ్యవాదం మితిమీరిన కారణాన రెండు ప్రపంచ యుద్ధాలు జరగడంతో ఐరోపా, జపాన్ వాసులు చాలా నష్టపోయిన తరువాత సామ్రాజ్యవాదం మానవాళికి శ్రేయస్కరమైనది కాదని ప్రపంచం గుర్తించింది. ఆ తరువాత హిందూస్థానం స్వాతంత్ర్యం సాధించి ఆనాడు తిండికి కూడా లేని బీదరికంతో హిందూదేశంగా అవతరించింది. ఇక్కడ ఇస్లామ్‌ని అవలంబించినవారు నేటి బంగ్లాదేశ్‌తో సహా ఆనాడు పాకిస్థాన్‌గా విడిపోయారు. హిందూ దేశంలో స్వాతంత్ర్యం వచ్చిన అరవై సంవత్సరాలకు అందరికీ కూడు, గుడ్డ, గూడు ఏర్పరుచుకోగల స్థితికి చేరగలుగుతున్నాము.

నేడు హిందూదేశంలో సనాతన ధర్మం అయిన వైదికం, శైవం, శాక్తేయం, వైష్ణవం అనేక రూపాలతో అనేక శాఖలతోను అక్కడక్కడ భూత ప్రేత పిశాచాల ఆరాధనతోను ఒక చోట రావణాసుర ఆరాధనతోను ఉంది. గాయత్రి ఛందస్సులో ఉన్న సవిత దేవత మంత్రంతో సకల దేవతా స్వరూపిణిగా గాయత్రి ఉపాసన సుమారు మూడు వేల సంవత్సరాలుగా నేటికీ ఆచరించబడుతోంది. నాటి (నేటికీ) జనసామాన్యానికి తపస్సు కష్టతరమవడం చేత సుమారు 2400 సంవత్సరాల క్రితం దేవతలందరికీ రూపకల్పన చేసి విగ్రహారాధనతో దేవాలయాలను ఏర్పాటుచేశారు. హిందువులలో ఐకమత్యం కోసం శివ, శక్తి, నారాయణ, గణేశ, సూర్య విగ్రహాలను ఒకే మందిరంలో ప్రతిష్ఠించి ఆరాధించే పంచాయతనం అనే పద్ధతిని ఏర్పరచారు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను కలిపి దత్తాత్రేయ ఆరధన మొదలుపెట్టారు. వేద కాలం నాటి దేవతలైన ఇంద్రుడు, అగ్ని, యముడు, నిర్రుతి, వరుణుడు, వాయువు,కుబేరుడు (యక్షుల ఆరాధ్యుడు), ఈశాన్య (ఈశ్వరుడు)లను అష్ట దిక్పాలకులుగాను, నవ గ్రహాలను, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను, శక్తి స్వరూపిణియైన దుర్గను, గణేశుడిని, నారాయణులను ఇతర దేవతల్ని అందరినీ ఒకే చోట ఆరాధించే సత్యనారాయణ వ్రతం ఆచరిస్తున్నారు. అసురీ లక్షణాలను పోగొట్టుకుని దైవీ లక్షణాలను అలవరచుకోవడానికి అయ్యప్ప దీక్ష, భవానీ దీక్ష, సిద్దులు పొందడానికి ఆంజనేయ ఉపాసన, మంచి అలవాట్లు, శ్రేయస్సులకోసం అనేక వ్రతాలు, నోములు అవలంబిస్తున్నారు. భగవంతుని అనేక విధాలుగా సేవించి పాప ప్రక్షాళన చేసుకుంటున్నారు. దాన ధర్మాలు చేసి పుణ్యం పొందుతున్నారు. పైన తెలిపినవన్నీ హిందూ మతంలోనివే. హిందూ దేశంలో హిందూ మతం కాక జైన, సిక్కు, బౌద్ధ మతాలు కూడా ఆచరణలో ఉన్నాయి. ఇవన్నీ స్వదేశీ మతాలు. ఇవిగాక వలస వచ్చి స్థిరపడిన పార్శీల జరాతుస్త్ర మతం, యూదుల జుదా మతం, విదేశీ పాలకులతో వచ్చిన ఇస్లామ్, వాటి అనేక శాఖలు, క్రిస్టియన్ మతాలు కూడా హిందూ దేశంలో ఆచరణలో ఉన్నాయి.

హిందూదేశంలో ఆచరణలో ఉన్న పైన చెప్పిన చాలా చాలా మతాలు, శాఖలు, కులాలు, రాజకీయ పార్టీల కారణంగా మితిమీరిన అనైక్యత ఉంది. ఈ అనైక్యతను ఉపయోగించుకొని దేశాన్ని విచ్ఛిన్నం చేసి తమ రాజకీయ లేక మత సామ్రాజ్యాలలో కలుపుకోవాలని అనేకులు ప్రయత్నిస్తున్నారు. ఆతంక వాదాన్నుపయోగించి విధ్వంసం సృష్టించి శాంతిభద్రతలు లేకుండా చేస్తున్నాయి. కొన్ని విదేశీ మతాల వారు మతాన్నుపయోగించి రాజ్యాధికారాన్ని చేజిక్కించుకుని తమ మత సామ్రాజ్యాన్ని అభివృద్ధిపరచుకోవాలని ప్రయత్నిస్తున్నారు.కొన్ని ప్రభుత్వాలు హిందూ మతాన్ని నీరసింపజేస్తున్నవి. దీనినిలాగే సాగనిస్తే మన పూర్వీకులు ఎన్నో కష్టనష్టాలకోర్చి సాధించిన స్వాతంత్ర్యాన్ని జారవిడుచుకొనే కాలం ఎంతో దూరం లేదు. మనమందరం ఏకమై దీనిని అరికట్టాల్సిన అవసరం ఎంతైనా ఉంది. హిందూ మతానికి ఒక వ్యవస్థను ఏర్పరచి హిందూ మత ప్రచారకులను ఏర్పరచి వారికి శిక్షణ ఇచ్చి, దేశంలోని అన్ని ఊళ్ళలోను, అన్ని గ్రామాల్లోను, హిందూ మత ప్రచారం చేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది. దానికి నాంది పలకడానికే ఈ రచన. లేవండి. నడుం కట్టండి. ముందడుగు వేయండి. హిందూ మతం ద్వారా ప్రజల్లో సంస్కారాన్నభివృద్ధిపరచి పటిష్ట సమైక్య సమాజాన్ని హిందూ దేశంలో సాధించండి. ఐకమత్యం పెంచండి. దేశంలో శాంతిభద్రతల కోసం దేశ పటిష్టత కోసం ఇది ఎంతో అవసరం. మతపరమైన ఐకమత్యం కోసం అందరూ గీతా శాస్త్రాన్ని అనుసరించండి.

## 3.3.0 స్వాభావిక కర్మ :

సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేః జ్ఞానవానపి ।
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి ॥ **(3 : 33)**

జ్ఞాని అయినా తన ప్రకృతి (స్వభావం)కి తగినట్లు పనిచేయును. జీవులన్నియు ప్రకృతి నుండి పొందిన స్వాభావాన్ని నిగ్రహించలేవు.

సహజం కర్మ కౌంతేయ సదోషయపి న త్యజేత్ ।
సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః ॥ **(18 : 48)**

అగ్ని పొగచే ఆవరింపబడు విధముగా అన్ని ప్రయత్నములును దోషముతో ఆవరింపబడియుండును. దోషముతో కూడినదైనను స్వాభావిక కర్మను ఎవరూ విడువరాదు.

యదహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే ।
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి ॥ **(18 : 59)**

నీ అహంకారం వలన యుద్ధము (క్షత్రియ స్వాభావిక కర్మ) చేయనని తలచినను నీ స్వభావము నీ స్వాభావిక కర్మ (యుద్ధము) యందు నియోగించును.

స్వభావజేన కౌంతేయ నిబద్ధః స్వేన కర్మణా ।
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్ కరిష్యస్యవశోపి తత్ ॥ **(18 : 60)**

నీవు ఇష్టపడని స్వాభావిక కర్మను నీ స్వభావ వశమున చేసెదవు.

## 3.3.1 వర్ణాలు :

బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ పరంతప ।
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః **(18 : 41)**

గుణ స్వభామములననుసరించి బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు మరియు పనులు విభజింపబడినవి.

శమో దయస్తపః శౌచం క్షాంతిరార్జవమేవ చ ।
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రహ్మకర్మస్వభావజమ్ ॥ **(18 : 42)**

మనో నిగ్రహం, ఇంద్రియ నిగ్రహం, తపస్సు, శుచి, సహనము, నిజాయితి, జ్ఞాన విజ్ఞానములు, భగవంతుని యందు నమ్మకము, భగవత్సేవ బ్రాహ్మణుని స్వాభావిక కర్మలు.

శౌర్యం తేజో ధృతిర్ధాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్ ।

దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్ ॥ **(18 : 43)**

శౌర్యము, శక్తి, ఆత్మ విశ్వాసము, సమర్ధత, యుద్ధము నుండి పారిపోకుండుట, దానము చేయుట, ఎల్లరి హితము కోరి పరిపాలించుట క్షత్రియుల స్వాభావిక కర్మలు.

కృషిగౌరక్ష్యవాణిజ్యం వైశ్యకర్మస్వభావజమ్ ।

పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్ ॥ **(18 : 44)**

వ్యవసాయము, గోరక్షణ, వాణిజ్యములు వైశ్యుల స్వాభావిక కర్మలు. సేవ చేసే పనులు చేయుట శుద్రుల స్వాభావిక కర్మలు.

చిత్తాన్ని పరమాత్మ మీద నిలిపిననాడు ఆ పరమాత్మ ప్రాణులన్నింటిలోనూ ఉన్నాడని గ్రహించి ప్రాణులన్నింటినీ సమభావంతో చూస్తారు. అందరి శ్రేయస్సును కోరతాడు. అటువంటి మనిషి బ్రాహ్మణుడు. చిత్తాన్ని అహం మీద నిలిపి అహంకారంతో తాను తలచిన పనిని బలవంతంగానైనా సాధించ ప్రయత్నించి అందరినీ తన అధీనంలో ఉంచుకోవాలనుకునేవాడు క్షత్రియుడు. చిత్తాన్ని మనస్సు మీద నిలిపి మానసికానందాన్ని పొందడానికి ధన, వస్తు సేకరణలో నిమగ్నమయ్యేవాడు వైశ్యుడు. చిత్తాన్ని శరీరము, ఇంద్రయాల మీద నిలిపి వాటినుపయోగించడంలో నిమగ్నమయ్యేవాడు శూద్రుడు. వర్ణాలు గుణకర్మల ఆధారంగా ఏర్పడినవే. అవి జన్మ సంస్కార రీత్యా సంక్రమించగలవు. సంస్కార లోపం వలన మార్పులు కలగవచ్చు. కులాలు ఒక లక్షకు పైగా ఉన్నాయి. వర్ణాలు నాలుగే. కులాలు వేరు, వర్ణాలు వేరు. వర్ణం అనే పదం వరం, వరుడు అనే పదాలకు దగ్గరగా ఉన్నపదం. ఆ పదాలు కోరుకున్న లేక ఇష్టపడిన అనే అర్థంతో కూడుకున్నవి. ఆవిధంగా వర్ణం అంటే ఇష్టపడిన వ్యాపకం అనే అర్థం కలిగివుండవచ్చు. ఏ సమాజమైనా (రాజ్యమైనా) సజావుగా సాగాలంటే నాలుగు వ్యాపకాలు తప్పనిసరిగా ఉండవలసినదే. అవి (1) భగవత్సేవ, న్యాయం, ధర్మం, సమాజ శ్రేయస్సు కోరటం వాటికవసరమైన విద్యలు నేర్పటం, (2) సమాజ (రాజ్య) రక్షణ, యుద్ధ నైపుణ్యం, న్యాయం, ధర్మాలను రక్షిస్తూ రాజ్యపాలన చేయటం, (3) వ్యవసాయ వ్యాపారాల ద్వారా సంపదను అభివృద్ధిపరచి రాజ్యపాలనకు అవసరమైన వనరులను సమకూర్చటం, (4) కాలానుగుణంగా అవసరమైన ఉత్పత్తులకు అవసరమైన పనులు ప్రత్యక్షంగా లేక పరోక్షంగా చేసి సమాజం బరువును మోసే ముఖ్యమైన వ్యాపకం. పై నాలుగు వ్యాపకాలే చతుర్వర్ణాలు (నాలుగు వర్ణాలు) అన్నారు.

### 3.3.2 కులాలు :

సమాజంలో ఆర్థిక, నాగరిక, జ్ఞానాభివృద్ధిలో అనేక వృత్తులేర్పడి మార్పులు వచ్చినాయి. పౌరోహిత్యం, పూజారి లేక అర్చక, అధ్యాపక, ఆచార్లు, జ్యోతిష, ఆయుర్వేద, న్యాయ శాస్త్ర, పండిత మొదలైన వృత్తులేర్పడినాయి. దేశ, ప్రజారక్షణ పరిపాలనకు సంబంధించిన వృత్తులు చేపట్టారు. వాణిజ్యంతో సంపదనభివృద్ధిపరచి రాజ్యపాలనకు అవసరమైన వనరులను సమకూర్చారు. కాలానుగుణంగా సమాజానికి కావలసిన ఉత్పత్తులకు అవసరమైన పనులు ప్రత్యక్షంగా లేక పరోక్షంగా చేసి సమాజాభివృద్ధికి తోడ్పడే ముఖ్యమైన వృత్తులను చేపట్టారు.

సహజంగా పిల్లలు తామున్న వాతావరణం లేక పరిస్థితుల నుంచే చాలా విషయాలు నేర్చుకుంటారు. ఇంటిలోగానీ, ఇంట్లోవారు చేసేవిగానీ పనులనే పిల్లలు నేర్చుకుంటారు. అందువలన వృత్తులు వంశపారంపర్యంగా సాగినవి. ఎవరికైనా వారు చేసే పనినిబట్టి, వారి స్థితిగతులనుబట్టి, వారి చుట్టూ ఉన్న పరిస్థితులనుబట్టి వారి అవసరాలు, అలవాట్లు, ఆచార వ్యవహారాలు, ఆలోచనా విధానము, ఇష్టత–అయిష్టతలు ఏర్పడతాయి. ఆ కారణంచేత ఒకే వృత్తి చేసే వారందరూ కలసి ఒక సమూహంగా జీవించడం, స్నేహ–వివాహ సంబంధాలు ఇదే వృత్తి చేసేవారితోనే కలుపుకోవడం పరిపాటయిపోయింది.

ఆ సమూహాలను వారు చేసే వృత్తి పేరుతో కులం అన్నారు. ఆవిధంగా కులాలు ఏర్పడ్డాయి. పరిస్థితుల ప్రభావం వలన వలస వెళ్ళే గుంపుల పేర్లతోకూడా కులాలేర్పడి ఉండవచ్చు. ఇవికాక అడవుల్లోను, కొండలలోను నివసించే వారి గుంపు పేరులతో కూడా కులాలు ఏర్పడి ఉండవచ్చు. వ్యవసాయ ఆధారంగాను, అనేక జాతుల మనుషులు కలిసిపోయి స్థిరపడ్డ సమాజంలో జరిగింది. నేడు ఒక లక్షకు పైగా కులాలున్నాయని విద్యావంతులంటున్నారు. సమాజంలో ఏర్పడిన వివిధ వృత్తులను నాలుగు వర్ణాలుగా వివరించారు.

**పంచములు :**

మనువు అయిదవ వర్ణం లేదన్నాడు. నాగరకత అభివృద్ధి చెందిన సభ్య సమాజానికి దూరంగా అడవుల్లోను, కొండలలోను అక్కడి సంపద మీద ఆధారపడి కొన్ని అనాగరిక తెగలు ఉండేవి. వారు నాగరకత అభివృద్ధి చెందిన సమాజ వ్యవస్థకు కట్టుబడి ఉండేవారు కారు. వారిని చాతుర్వర్ణ వ్యవస్థకు బయటివారుగా అయిదవ వారుగా పంచములని పిలువబడ్డారు. వారి అనాగరకత వలన ఆర్థికంగా కూడా వెనకబడ్డారు. వారిలో కొందరు నాగరక సమాజానికి విరుద్ధమైన కార్యకలాపాలు (దొంగతనం, దోపిడి, మత్తు పానీయాలు తయారీ మొదలైనవి) చేస్తుండేవారు. కాలక్రమేణా వారి ఆర్థికావసరాల కోసం నాగరిక సమాజంలో కలవడం మొదలయ్యాక వారి అనాగరిక ఆచార వ్యవహారాల నుంచి నాగరిక సమాజాన్ని కాపాడడం కోసం కొన్ని కట్టుబాట్లు చేశారు. ఆంగ్లేయ పరిపాలన కాలంలో ఆంగ్లేయులు కూడా వారిని నాగరిక సమాజం నుంచి దూరంగా స్థిరపరిచారు (సెటిల్‌మెంట్లు).

## కుల వివక్షణ లేదు :

భారతీయ సంస్కృతిలో కుల ప్రసక్తి లేకుండా జ్ఞానియై లోకోపకారం చేసిన వారిని ప్రజలందరూ గౌరవించారు. ఉదాహరణకు **వాల్మీకి :** హిందువులు చాలా ఉన్నతమైనదిగా చెప్పే రామాయణం రచించిన వాల్మీకిని మహామునిగా కొన్ని వేల సంవత్సరాల తరువాత కూడా నేటికీ అందరూ గౌరవిస్తారు. ఆ మహాముని పేరుని సగౌరవంగా వినమ్రంగా తలుచుకుంటారు. వాల్మీకి మహాముని అవటానికి ముందు అడవుల్లో దారి కాచి ప్రయాణికుల ప్రాణాలు తీసి వారి సొమ్ముని దోచుకొని బ్రతికిన కిరాతకుడుగా చెప్తారు. కొందరు బోయవాడంటారు. అటువంటివాడు నారద ముని చెప్పిన మంచి మాటలతో సంస్కరింపబడి తపస్సు చేసి జ్ఞానాన్ని పొంది ఎన్నో ధర్మ సూత్రాలను రామాయణం ద్వారా లోకానికందించిన గొప్ప జ్ఞానిగా నేటికీ చిరస్మరణీయంగా నిలిచాడు.

**వేదవ్యాసుడు :** ఒక పల్లెకారుడి (మత్స్యకారుడు) కుమార్తె అయి నావ నడిపిన సత్యవతికి కలిగిన కుమారుడు శ్రీకృష్ణద్వైపాయనుడు. ఆ కుమారుడు చిన్న వయసులోనే తపస్సు చేసి అప్పట్లో మహా సముద్రంలాగా కలిసిపోయి ఉన్న వేద రాశిని సులువుగా నేర్చుకోవడానికి వీలుగా నాలుగు వేదాలుగా నియంత్రించి, పదిహేడు పురాణాలను వ్రాసి, మహాభారతాన్ని రచించి, దాని ద్వారా భగవంతుడు ఆపద్బాంధవులైన శ్రీకృష్ణ బలరాములుగా యాదవులింట అవతరించి, రాజకీయ చాతుర్యాన్ని ప్రయోగించి, సామ్రాజ్యంలో న్యాయం, ధర్మం, నీతి, నిజాయితీలను నెలకొల్పి భగవంతుడు ఒక్కడే అనీ, సర్వాంతర్యామి అని, మానవులందరూ తమను తామే ఉద్ధరించుకోవచ్చని, అలా చేయడానికి మార్గాలు తెలిపిన గీతా శాస్త్రాన్ని (భగవద్గీత) జనసామాన్యానికి అందించి పరమాత్ముని యెడల భక్తి, ప్రేమ కలిగించే భాగవతాన్ని రచించి హిందూ మతాన్ని పునఃస్థాపించిన వేదవ్యాసుడుగా భారతీయ సంస్కృతిలో ఒక ఉత్కృష్టమైన స్థానాన్ని అలంకరించాడు.నేటికీ వేదవ్యాసుడిని వ్యాస భగవానుడుగా గౌరవిస్తారు కొందరు. మత్స్య కన్య కుమారుడై మహా సముద్రంలాగా కలిసివున్న వేదరాశిని నాలుగు వేదాలుగా నియంత్రించిన కారణంగా పరమాత్ముని దశావతారాల్లో ఒకటైన మత్స్యావతారంగా గౌరవిస్తారు మరికొందరు.

**రాముడు, కృష్ణుడు :** కుల విచక్షణ లేదనడానికి మరికొన్ని ఉదాహరణలు : భగవంతుని అవతారాలైన శ్రీరాముడు క్షత్రియుడు. శ్రీకృష్ణుడు యాదవుడు. అయినప్పటికీ వారిని భగవత్స్వరూపులుగా కొలుస్తారు.

**కులాంతర వివాహాలు :**

ప్రాచీన వాఙ్మయంలో కులాంతర వివాహాలు కూడా జరిగినట్లు వ్రాశారు. శంతన మహారాజు క్షత్రియుడు. మత్స్యకారిణి సత్యవతిని ప్రేమించి వివాహం చేసుకున్నాడు. కణ్వ మహర్షి వద్ద పెరిగిన శకుంతల క్షత్రియుడైన దుష్యంతుని ప్రేమ వివాహం చేసుకుంది. క్షత్రియుడైన అర్జునుడు యాదవ స్త్రీ అయిన సుభద్రను వివాహమాడాడు. కులాలు వేరు, వర్ణాలు వేరు. కులాలు ఒక లక్షకు పైగా ఉన్నవి. వర్ణాలు నాలుగే. వర్ణాలు స్వభావాన్ననుసరించి ఏర్పడినవి. ఏ కులంలో అయినా నాలుగు వర్ణాల వారు ఉండవచ్చు.

## 4.0.0 లక్షణాలు :

ద్వౌ భూతసర్గౌ లోకేస్మిన్ దైవ ఆసుర ఏవ చ ।
దైవో విస్తరశః ప్రోక్తః ఆసురం పార్థ మే శృణు ॥ **(16 : 6)**

లోకమునందు దైవాసురలనెడి రెండు రకముల జీవులు కలరు.

దైవీ సంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా ।
మా శుచః సంపదం దైవీమ్ అభిజాతోసి పాండవ ॥ **(16 : 5)**

దైవీ లక్షణములు గలవారు మోక్షము కొరకును, అసురీ లక్షణములు గలవారు బంధముల కొరకు ఉందురని పరిగణింపబడినది.

అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః ।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తవ ఆర్జవమ్ ॥ **(16 : 1)**

భయము లేకుండుట, సాత్త్వికత, మలినము లేకుండుట, జ్ఞాన యోగ స్థితిలో వ్యవహరించుట, దానము, ఇంద్రియ నిగ్రహము, భగవతారాధన, వేద శాస్త్ర పఠన, తపస్సు, సరళత్వము.

అహింసా సత్యమక్రోధః త్యాగః శాంతిరపైశునమ్ ।
దయా భూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీరచాపలమ్ ॥ **(16 : 2)**

అహింస, సత్యము, కోపము లేకుండుట, త్యాగము, శాంతి ఇతరుల దోషములెన్నకుండుట, సకల జీవులయందు దయకలిగి ఉండుట, ఆశ లేకుండుట, మృదుత్వం, సిగ్గు ఉండుట వలన తప్పులు చేయకుండుట, చాంచల్యం లేకుండుట.

తేజః క్షమా ధృతిః శౌచమ్ అద్రోహో నాతిమానితా।
భవంతి సంపదం దైవీమ్ అభిజాతస్య భారత ॥ **(16 : 3)**

తేజస్సు, క్షమ, నిశ్చయము, బాహ్యశుద్ధి, ద్రోహము చేయకుండుట, గౌరవము కోరకుండుట దైవీ లక్షణములు.

దంభో దర్పోభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ ।
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపదమాసురీమ్ ॥ **(16 : 4)**

కపటము, మొండితనము, అహంకారము, క్రోధము, కఠినత్వము, అజ్ఞానము అసురీ లక్షణములు.

ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః ।
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే ॥ **(16 : 7)**

అసురీ లక్షణాలు గలవారు కర్తవ్యమేదో చేయరానిదేదో ఎరుగరు. వారిలో శుచి, మంచి ప్రవర్తన, సత్యభాషణ ఉండదు.

అసత్యమప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరమ్ ।
అపరస్పరసంభూతం కిమన్యత్ కామహైతుకమ్ ॥ **(16 : 8)**

వారు జగత్తు ఆధారము లేనిదనియు, అసత్యమనియు, భగవంతుడు లేడనియు, కామము, సంయోగముల వలన పుట్టుచున్నదితప్ప వేరే కారణము లేనిదనియు చెప్పుదురు.

ఏతాం దృష్టిమవష్టభ్య నష్టాత్మానోల్పబుద్ధయః ।

ప్రభవంత్యుగ్రకర్మాణః క్షయాయ జగతోహితాః ॥ **(16 : 9)**

ఆ దృష్టితో అల్పబుద్ధి కలవారై ఆత్మ తెలిపే మంచి చెడులను తెలుసుకొనక జగత్తునకు మేలు కానటువంటి వినాశకరమగు క్రూర కర్మలలో నియుక్తులగుదురు.

కామమాశ్రిత్య దుష్పూరం దంభమానమదాన్వితాః ।

మోహాద్గృహీత్వాసద్గ్రాహాన్ ప్రవర్తంతేశుచివ్రతాః ॥ **(16 : 10)**

మితిలేని కోరికలతో కపటము, అహంకారము, మదములు కలిగి భ్రాంతి వలన ఆశాశ్వతములైన వానిని గ్రహించి సదా అపవిత్రులై ఉందురు.

చింతామపరిమేయాం చ ప్రలయాంతాముపాశ్రితాః ।

కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః ॥ **(16 : 11)**

ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః ।

ఈహంతే కామభోగార్థమ్ అన్యాయేనార్థసంచయాన్ ॥ **(16 : 12)**

కామ భోగాలే పరమావధి అని నిశ్చయించి, జీవితమంతా మితంలేని చింతలనాశ్రయించి వందల కొలది ఆశాపాశాలలో బందీలై కామక్రోధాలు గలవారై కామభోగాల కొరకు అన్యాయంగా ధన సంపాదన కావింతురు.

ఇదమద్య మయా లబ్ధమ్ ఇమం ప్రాప్స్యేమనోరథమ్ ।

ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్ ॥ **(16 : 13)**

ఈనాడు ఇది పొందాను. కోరినది పొందెదను. ఇంత ధనము కలదు. ఇది కూడా భవిష్యత్తులో అభివృద్ధి చెందగలదు...

అసౌ మయా హతః శత్రుః హనిష్యే చాపరానపి ।

ఈశ్వరోహమహం భోగీసిద్ధోహం బలవాన్ సుఖీ ॥ **(16 : 14)**

నేను ఈ శత్రువును చంపాను. ఇతర శత్రువులను కూడా చంపెదను. నేను ప్రభువును, భోగిని, సిద్ధపురుషుడను, నేను బలవంతుడను (అన్నిటిలో), సుఖిని.

ఆఢ్యోభిజనవానస్తి కోన్యోన సదృశోమయా ।

యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః ॥ **(16 : 15)**

నేను గొప్ప సంపద, పరివారముగల వాడను. నాతో సమానులెవరూ లేరు. యజ్ఞ దానములు చేసి సంతోషింతును అని అజ్ఞానముతో మోహితులై ఉందురు.

అనేక చిత్తవిభ్రాంతాః మోహజాలసమావృతాః ।

ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేశుచౌ ॥ **(16 : 16)**

అనేక చిత్త విభ్రాంతులతో మోహజాలబద్ధులై కామభోగాలలో ఆసక్తులై మలినమైన నరకములో పడుదురు.

ఆత్మ సంభావితాః స్తబ్ధాః ధనమానమదాన్వితాః ।

యజంతే నామయజ్ఞైస్తే దంభేనావిధిపూర్వకమ్ ॥ **(16 : 17)**

తనకు తానే అధికంగా భావించి గర్వముతో ధన గౌరవాలతో పొందిన మదంతో కపటులై విధిననుసరింపక నామమాత్రపు యజ్ఞములను చేయుదురు.

అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః ।

మామాత్మపరదేహేషు ప్రద్విషంతోభ్యసూయకాః ॥ **(16 : 18)**

అహంకారం, బలం, దర్పం, కామక్రోధాలు కలిగి తమయొక్క, ఇతరుల యొక్క దేహములలోనున్న నన్ను (పరమాత్మను) అసూయతో దూషింతురు.

## 4.1 ధర్మ సంస్థాపన :

అసురీ లక్షణాలుగల వారి వలన సమాజంలో దుర్మార్గులు అధికమై ధర్మమునకు హాని కలిగి అధర్మము వృద్ధినొంది మంచివారు అనేక కష్టనష్టాలు అనుభవించెదరు.

యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।

అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥ **(4 : 7)**

ధర్మమునకు హాని కలిగి అధర్మము వృద్ధి చెందినప్పుడల్లా అవతరించుచుందును.

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।

ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥ **(4 : 8)**

దుర్మార్గులను నశింపజేసి సజ్జనులను రక్షించి, ధర్మమును స్థాపించుటకు ప్రతి యుగమునందును అవతరించుచుందును.

భారతావనిలో విదేశీయుల పాలనలో అధర్మము వృద్ధినొంది సామాన్యులు అనేక కష్టనష్టాలు అనుభవించినపుడు మహాత్ముడైన గాంధీజీ శాంతియుత స్వాతంత్ర్య సమరాన్ని నడిపి విదేశీయ పాలనను అంతమొందించి స్వదేశీయ పరిపాలనను నెలకొల్పాడు. ఇటీవల ప్రభుత్వంలో అవినీతి వృద్ధినొందగా శ్రీ అన్నా హజారే విజృంభించి అవినీతి నిర్మూలనకు నడుంకట్టారు. ఆత్మ అందరిలోనూ ఉంది. ఆత్మ కూడా పరమాత్మే. మహాత్ముల ద్వారా పరమాత్మ ధర్మ రక్షణ చేస్తుంటారు.

## 5.0 జీవికి అంతం లేదు :

పునర్జన్మలున్నవనేది నేడు విజ్ఞానం ఆమోదించిన విషయమని డా॥ గ్రాన్విల్ ధర్మవర్ధనే, యూనివర్సిటీ ఆఫ్ కొలంబో, తెలిపారు. డా॥ స్టీవెన్సన్, యూనివర్సిటీ ఆఫ్ వర్జీనియా (యు.యస్.ఏ.), 3000 మంది పిల్లలు తెలిపిన గత జన్మ స్మృతులను శోధించి నిజమని తెలుసుకొని ముద్రించారు. ఇంకా చాలామంది వైజ్ఞానికులు ఇటువంటి పరిశోధనలను జరిపి పునర్జన్మలు జరుగుతున్నవని ధృవీకరించారు. వారిలో డా॥ సత్వంత్ పశ్రిచ (నింహాన్స్, బెంగుళూరు) ఒకరు.

న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః ।

న చైవ న భవిష్యామః సర్వే నయమతః పరమ్ ॥ **(2 : 12)**

నేను కానీ నీవు కానీ ఈ రాజులు గానీ (ఎవరైననూ) ఉండని సమయం లేదు. భవిష్యత్తులో కూడా మనమందరం ఉండకపోము.

దేహినోస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా ।

తథా దేహాంతరప్రాప్తిః ధీరస్తత్ర న ముహ్యతి ॥ **(2 : 13)**

శరీరమును ధరించినవాని శరీరమునకు బాల్యము, యౌవ్వనము, వృద్ధాప్యము ఉన్నట్లే (మరణానంతరం) మరియొక శరీరమును పొందును. ధీరుడు ఈ విషయమున మోహమునొందదు (దుఖించదు).

## 5.1 కర్మ ఫలం :

కర్మణఃసుకృతస్యాహుః సాత్త్వికం నిర్మలం ఫలమ్ ।

రజసస్తు ఫలం దు:ఖమ్ అజ్ఞానం తమసః ఫలమ్ ॥ **(14 : 16)**

సత్త్వ గుణముతో మంచి పనులు చేస్తే నిర్మలమైన (దైవీ లక్షణాలు, దైవానుగ్రహము) ఫలము, రజోగుణముతో చేసే పనులకు దు:ఖము, తమో గుణముతో చేసే పనులకు అజ్ఞానము ఫలితములని చెప్పబడును.

అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్ ।
భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్ ॥ **(18 : 12)**

కర్మఫల త్యాగము చేయనివానికి తాను చేసిన కర్మలకు మరణానంతరం ఇష్టమైనవి, ఇష్టము కానివి, మిశ్రమమైనవి అని మూడు విధములైన ఫలితములుండును. సన్యాసులకు ఎప్పుడైనా ఎటువంటి ఫలితములుండవు (అనుభవము కలుగదు).

## 5.2 మరణానంతరం :

శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః ।
గృహీత్వైతానిసంయాతి వాయుర్గంధానివాశయాత్ ॥ **(15 : 8)**

వాయువు మూలమునుండి వాసనలను కొనిపోయినట్లుగా ఆత్మ దేహమును వదలునప్పుడు మనసు, ఇంద్రియములను గొనిపోయి, వేరొక శరీరమును పొందును.

యత్ర కాలే త్వనావృత్తిమ్ ఆవృత్తిం చైవ యోగినః ।
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ ॥ **(8 : 23)**

యోగులు ఏ కాలమందు దేహత్యాగము చేసిన యెడల తిరిగి జన్మించరో లేక తిరిగి జన్మింతురో ఆ కాల గతులను తెల్పెదను.

అగ్నిర్జ్యోతిరహః శుక్లః షన్మాసా ఉత్తరాయణమ్ ।
తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥ **(8 : 24)**

పరబ్రహ్మమును తెలిసిన వారు ఉత్తరాయణములో శుక్ల పక్షములో పగటి సమయమున దేహత్యాగము చేసినవారు అగ్ని, జ్యోతిర్మయ మార్గములో పరబ్రహ్మ కడకేగుదురు.

ధూమో రాత్రిస్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్ ।
తత్ర చాంద్రమసం జ్యోతిః యోగీ ప్రాప్య నివర్తతే ॥ **(8 : 25)**

దక్షిణాయనములో కృష్ణపక్షంలో రాత్రి సమయమున దేహత్యాగము చేసిన యోగులు పొగ మార్గంలో చంద్రలోకం చేరి తిరిగి జన్మింతురు.

శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే ।
ఏకయా యాత్యనావృత్తిమ్ అన్యయావర్తతే పునః ॥ **(8 : 26)**

వెలుగు, చీకటి మార్గములలో వెలుగు మార్గములో వెళ్ళినవారు తిరిగి జన్మింపకుండుట, చీకటి మార్గములో వెళ్ళినవారు తిరిగి వచ్చి జన్మింతురని శాశ్వతాభిప్రాయము.

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే ।
తే పుణ్యమాసాద్య సురేంద్రలోకమ్ అశ్నంతి దివ్యాన్ దివి దేవభోగాన్ ॥ **(9 : 20)**

మూడు (ఋగ్, యజు, సామ) వేదములనెరిగి యజ్ఞములతో నన్ను పూజించి సోమ రసమును త్రాగి పాపములు నశించి స్వర్గమును ప్రార్థించిన వారు పుణ్యమును పొంది ఇంద్రలోకమున దివ్యమైన స్వర్గమునందు దేవతలు అనుభవించు భోగములను అనుభవింతురు.

యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రలయం యాతి దేహభృత్ ।
తదోత్తమవిదాం లోకాన్ అమలాన్ ప్రతిపద్యతే ॥ **(14 : 14)**

సత్త్వ గుణము వృద్ధిపొందియున్నప్పుడు మరణించినవాడు పవిత్రమైన మహర్షుల లోకమును చేరును.

రజసి ప్రలయం గత్వా కర్మసంగిషు జాయతే ।

తథా ప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే ॥ **(14 : 15)**

రజోగుణము నందు మరణించినవాడు కామ్య కర్మలయందాసక్తిగలవారి వద్ద జన్మించును. తమో గుణమునందు మరణించినవారు మూఢులైన ప్రాణులయందు జన్మించును.

ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థాః మధ్యే తిష్ఠంతి రాజసాః ।

జఘన్యగుణవృత్తిస్థాః అధో గచ్ఛంతి తామసాః ॥ **(14 : 18)**

సత్త్వ గుణములో ఉన్నప్పుడు మరణించినవారు ఉత్తమ లోకములకు పోవుదురు. రజో గుణమునందున్నప్పుడు మరణించిన వారు మధ్యస్థమైన లోకములకును తమో గుణమునందున్నప్పుడు మరణించిన వారు నీచ లోకములకు పోవుదురు.

## 5.3 పునర్జన్మలు :

వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోపరాణి ।

తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ ॥ **(2 : 22)**

మానవుడు చిరిగిన వస్త్రములను విడిచి నూతన వస్త్రమును గ్రహించు విధముగా దేహధారి అయిన జీవి నిష్ప్రయోజనమైన దేహమును వదలి మరొక క్రొత్త దేహమును గ్రహించును.

జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ ।

తస్మాదపరిహార్యేర్థే న త్వం శోచితుమర్హసి ॥ **(2 : 27)**

పుట్టినవానికి మరణము తథ్యము. మరణించిన వానికి కూడా పుట్టుక తథ్యము. అనివార్యమైన ఈ విషయము గురించి దుఃఖింపరాదు.

పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్ ।

కారణం గుణసంగోస్య సదసద్యోనిజన్మసు ॥ **(13 : 21)**

జీవుడు భౌతిక ప్రకృతిలో (శరీరముయందు) ఉండి ప్రకృతి జనిత గుణములను అనుభవించును. ఈ గుణ సంపర్కమే ఆ జీవునకు మంచి లేక చెడు జన్మలకు కారణమగుచున్నది.

యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కలేవరమ్ ।

తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః ॥ **(8 : 6)**

ఎల్లప్పుడు ఏ భావమును స్మరించుచుండునో అంత్య కాలమున ఆ భావమును స్మరించుచూ దేహమును విడిచి ఆభావమునకు సరిపడు శరీరమును పొందును.

తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి ।

ఏవం త్రయీధర్మమనుప్రపన్నా గతాగతం కామకామా లభంతే ॥ **(9 : 21)**

స్వర్గ లోకమున విస్తృతంగా అనుభవించినవారు వారి పుణ్యము క్షీణించగానే భూలోకమున జన్మింతురు. ఈవిధముగా వేద ధర్మాలననుసరించువారు ఇంద్ర భోగములను కోరుచూ జనన మరణములను పొందుదురు.

తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ।

క్షిపామ్యజస్రమశుభాన్ ఆసురీష్వేవ యోనిషు ॥ **(16 : 19)**

పరులను ద్వేషించు, క్రూరులైన నరాధములను ఈ సంసారమున అసురీ లక్షణములు గలవారి గర్భముల ద్వారా మాటిమాటికినీ జన్మింపజేయుదును.

అసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని ।
మామప్రాప్యైవ కౌంతేయ తతో యాంత్యధమాం గతిమ్ ॥ **(16 : 20)**

జన్మ జన్మలకు అసురీ జన్మలు పొందిన మూఢులు నన్ను పొందకయే నీచ గతిని పొందుదురు.

## 5.4 భూతలము స్వర్గమా? నరకమా?

పైన తెలిపిన విషయాలు సత్యాలే అని వైజ్ఞానికంగా తెలుస్తున్నది. విజ్ఞాన, వాణిజ్య, రాజకీయపరంగా నేడు ప్రపంచంలో ఉత్కృష్ట స్థాయిలో ఉన్న యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా దేశంలో సుమారు క్రీ.శ. 1975వ సంవత్సరం ప్రాంతంలో వైజ్ఞానికంగా, సహేతుకంగా పరిశోధనలు జరిపి మనిషి మరణానంతరం ఆ మనిషి ఆత్మ అంతమవకుండా గతించిన జీవితంలోని ఘటనల స్మృతులతో మరొక లోకంలో తిరుగాడుతుందని, జీవించివుండగా ఆ మనిషి చేసిన పనులన్నీ పునర్దర్శించబడతాయని శాస్త్రజ్ఞులైన ఇద్దరు సోదరులు డాక్టర్ అర్నాల్డ్ మరియు డాక్టర్ అర్నాల్డ్ (సోదరులు) నిర్ధారించారు. వారి పరిశోధనా వృత్తాంతాన్ని 'లైఫ్ ఆఫ్టర్ లైఫ్' పుస్తక రూపంలో విడుదల చేశారు. ఆ విషయాన్నాధారంగా చేసుకొని హాలీవుడ్‌లో 'ఘోస్ట్' అనే పేరుతో చలనచిత్రం నిర్మించబడింది. ఇటీవల కాలంలో మరణించిన వారి ఆత్మల ఛాయా చిత్రాలు కూడా తీయడం జరిగింది. అటువంటి ఛాయాచిత్రాలను ఆంధ్రభూమి సచిత్ర వార పత్రికలో చూడవచ్చు (21 జూన్ 2007 52వ పేజి, 17 మే 2007 52వ పేజి). సుమారు క్రీ.శ. 2000–2001లో 'స్టార్ ప్లస్' ఇంగ్లీష్ టీవీ ఛానల్‌లో ప్రతి మంగళవారం రాత్రి 8 గంటలకు నమ్మలేని నిజాలను చూపించిన కార్యక్రమంలో ఒకరు మరణించి వేరే లోకంలో అగ్ని గోళాల్లో బాధపడుతూ తిరుగుతున్న మనుషుల్ని (చనిపోయినవారు) చూసిన తరువాత తిరిగి బ్రతికి తన జీవన సరళిని మంచిగా మార్చుకున్న ఉదంతాన్ని చూపారు. అదే కార్యక్రమంలోమరొకసారి ఒక పిల్లవాడు తన తల్లితో 'తను ఆమె తండ్రినని చెబుతూ, ఆమెకు ఆమె తండ్రికి తెలిసిన విషయాలను చెబుతూ ఆమెను వాత్సల్యంగా చూడడం, ఆ పిల్లవాడికి గుండె దగ్గర అనారోగ్యం, ఎక్స్ రేలో వాటి సూచనలు కనిపించడానికి, ఆమె తండ్రి (పోలీస్ ఆఫీసర్) దుండగుల కాల్పుల్లో ఆయన గుండెలో తూటాలు దిగి మరణించడానికి ఆత్మ (సూక్ష్మ శరీరం) ద్వారా మరుజన్మలో కూడా పూర్వజన్మ శారీరక రుగ్మతలు సంప్రాప్తిస్తాయా అనే అనుమానాన్ని కలిగించడం' చూపారు. మరికొందరు శాస్త్రజ్ఞులు పునర్జన్మల గురించి పరిశోధనలు జరిపి, మనుషులు మరణానంతరం పునర్జన్మలనెత్తుతారని నిర్ధారించారు.

సృష్టిలో ఉన్న విజ్ఞానంలో మనుషులకు తెలిసినది చాలా తక్కువ. తెలియని విషయాలే చాలా ఎక్కువగా ఉన్నాయి. నిజమైన శాస్త్ర జ్ఞాన దృక్పథం ఉన్నవారు అనుమానాస్పద విషయాన్ని క్షుణ్ణంగా పరిశోధించి సత్యాన్ని తెలుసుకుని అందరికీ తెలియజేసి శాస్త్రజ్ఞులతో సంప్రదింపులు జరిపి నిర్ధారించాలి. అంతేగానీ అలా పరిశోధించకుండా పాత విషయాలన్నింటినీ మూఢ నమ్మకాలనడం అశాస్త్రీయం, మూఢత్వం.

జీవాత్మకు మరణం లేదు. కృశించిన పాత శరీరాన్ని వదలి మరొక లోకంలో కొంతకాలం తిరుగాడుతుంది. మరణించే ముందు జీవితంలో మంచి పనులు చేస్తే మరణానంతరం ఆనందించే మంచి లోకాల్లో తిరుగాడుతుంది. మరణించే ముందు జీవితంలో చెడు పనులు చేస్తే మరణానంతరం బాధలు పడే చెడు లోకాలలో తిరుగాడుతుంది. మరణించే ముందు జీవితంలో తాను పొందిన నిర్జీవ సజీవ వస్తువులలో దేనినీ మరణానంతరం తనతో తీసుకుపోలేదు. అన్నిటినీ ఇక్కడే వదలివేయాల్సిందే.

జీవితంలో తను చేసిన పనుల ప్రభావం మాత్రం ఈ లోకంలో మిగిలిపోతుంది. మంచి పనులు చేస్తే ఆ పనుల ప్రభావం ఈ లోకంలో మంచిగా ఉంటుంది. చెడు పనులు చేస్తే ఆ పనుల ప్రభావం ఈ లోకంలో చెడుగా ఉంటుంది. మనుషులు చేసే మంచి లేక చెడు పనుల ఆధారంగా భూతలం స్వర్గంగా లేక నరకంగా మిగులుతుంది. ఆ మంచి లేక చెడు ప్రభావాలు ఈ లోకంలో తన సంతతి అనుభవిస్తుంది. భూలోకాన్ని స్వర్గంగా తీర్చిదిద్దాలా లేక నరకప్రాయంగా చేయాలా అనేది ప్రతి మనిషి ఆలోచించాలి.

జీవాత్మ తిరిగి ఈ లోకంలో పునర్జన్మ పొందినపుడు తాను పూర్వజన్మలో చేసిన పనుల ఫలితాల ఆధారంగా పునర్జన్మ లభిస్తుంది. పూర్వ జన్మలో మంచి పనులు చేసిన వారికి పునర్జన్మలో మంచి జీవితం లభిస్తుంది. పూర్వ జన్మలో చెడు పనులు చేసిన వారికి పునర్జన్మలో చెడు జీవితం లభిస్తుంది. అక్రమంగా పరుల సంపద దోచుకున్నవాడు కొంతకాలం ఆనందించవచ్చు.

మరుజన్మలో దోచుకోబడ్డవాడి స్థానే జన్మిస్తే ఆ జీవితమంతా సంపద పోయినవాడిలాగ దుఖించవలసిరావచ్చు. ఈ లోకంలో జీవితం స్వర్గమా లేక నరకమా అనేది ఎవరికి వారే చేసుకుంటారు.

ఇదంతా ఎలా జరుగుతుంది అనేది సృష్టి రహస్యం. అందుచేత అశాశ్వతమైన సుఖసంతోషాలనిచ్చే పనులు చేయక శాశ్వతానందాన్నిచ్చే పనులు చేయాలి. అలా చేయడానికి మంచి లక్షణాలనలవరచుకొని సన్మార్గులుగా జీవించాలి.

## 6.0 జీవన విధానం :

ప్రతి మనిషి ఒక నియమిత రీతిలో మంచి జీవనాన్ని గడపాలి.

## 6.1 దశలు :

మనిషి జీవితాన్ని 4 దశలుగా విభజించారు. 1. బాల్యం, 2. కౌమారం, 3. యౌవనం, 4. వార్ధక్యం.

## 6.2 ఆశ్రమాలు :

ప్రతి మనిషి సామాన్యంగా తన జీవన విధానాన్ని 4 ఆశ్రమాలుగా గడపాలని నియంత్రించారు. అవి

1. బ్రహ్మచర్యం, 2. గృహస్థాశ్రమం, 3.వానప్రస్థం, 4. సన్యాసం.

**1. బ్రహ్మచర్యం :** బ్రహ్మచర్యంలో విద్యలు నేర్చుకోవడం ముఖ్యమైన బాధ్యత.సామాన్యంగా గురుకులంలో ఉండి విద్య నేర్చుకొనేవారు. గురుకులంలో ఉండే అధ్యాపకులకు, వారి సంసార జీవనానికి, విద్యార్థులకు అన్న, వస్త్ర, గృహావసరాలకు అవసరమైన వనరులకుగాను విద్యార్థులు గురుకులానికి దగ్గరగా ఉన్న ఊరిలో భిక్షాటన చేయడం, గురుకులంలో ఉండే గోవుల ఆలన పాలన చూడడం, దగ్గరలో ఉన్న అడవిలో దొరికే వస్తువులు (పుల్లలు ఏరి) తేవడం, గురు సేవ చేయడం మొదలైన పనులు చేసేవారు. విద్యార్థులు బ్రహ్మచర్యం తప్పనిసరిగా పాటించేవారు. ఇది కౌమార దశలో చేయాలి. ఈ దశలో సత్త్వ గుణాన్ని అలవరుచుకోవాలి.

**2. గృహస్థాశ్రమం :** బ్రహ్మచర్యంలో నేర్చుకున్న విద్యనుపయోగించి స్వయంగా పనిచేసి ధనం సంపాదిస్తూ వివాహం చేసుకుని సంసార జీవనం గడుపుతూ తల్లిదండ్రులను, దేవతలను, అతిథులను తగినవిధంగా సంతోషపెట్టడం, ఆశ్రయించిన వారిని పోషించడం, పంచ యజ్ఞాలు అయిన దేవయజ్ఞం (దైవ ప్రార్థన), పితృయజ్ఞం (తల్లిదండ్రుల సేవ), భూత యజ్ఞం (పశుపక్ష్యాదులకు ఆహారం, నీరు అమర్చుట), మనుష్య యజ్ఞం (అతిథి సేవ), బ్రహ్మ యజ్ఞం (జ్ఞానార్జన) మొదలైనవి చేయాలి. అవి యౌవన దశలో పాటించాలి.

**3. వానప్రస్థాశ్రమం :** వృద్ధాప్యం వచ్చిన తరువాత అంటే వార్ధక్య దశలో తను స్థిరపరిచిన సంతానానికి కలిగిన సంతతిని చూసి ప్రాపంచిక విషయాలను వదలి దూరంగా అడవికి వెళ్ళి అక్కడ దొరికే వస్తువులు ఉపయోగిస్తూ జీవించడం, బ్రహ్మచర్యం పాటించడం, వీలైనంత వరకు పంచయజ్ఞాలు చేయడం, మౌనం మొదలైన నియమాలను పాటించడం చేస్తూ బ్రహ్మజ్ఞానాన్ని పొందడానికి సాధన చేయాలి. నేటికీ పైన చెప్పిన వాటిలో అడవికి వెళ్ళడం మినహాయించి మిగిలిన పనులన్నీ చేయవచ్చు. సత్త్వ గుణం పెంచుకోవాలి.

**4. సన్యాసాశ్రమం :** సర్వసంగపరిత్యాగం, బ్రహ్మచర్యం, ఒక పూట భిక్షాటన, ఆత్మ దర్శనం చేయాలి. సన్యాసాశ్రమాన్ని వైరాగ్యం ఏర్పడిన తరువాత స్వీకరించాలి. త్రిగుణాతీతుడుగాను, స్థితప్రజ్ఞుడుగాను ఉండాలి.

అన్ని దశలలోను రజోగుణం, తమో గుణం, అదుపులో ఉంచడానికి ప్రయత్నించాలి.

## 6.3 సంస్కారం :

యే హి సంస్పర్శజా భోగా దు:ఖయోనయ ఏవ తే ।

ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః ॥ **(5 : 22)**

ఇంద్రియముల వలన కలుగు భోగములు అశాశ్వతములు, దుఃఖ కారకములు. వివేకి వానియందు ఆసక్తుడు కాడు.

శక్నోతీహైవ యః సోఢుం ప్రాక్ శరీరవిమోక్షణాత్ ।

కామక్రోధోద్భవం వేగం స యుక్తః స సుఖీ నర ః ॥ **(5 : 23)**

జీవించియుండగనే కామక్రోధాదుల ఉద్వేగములను అదుపులో ఉంచుకొనగలవారే సుఖవంతుడు.

త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః ।

కామః క్రోధస్తథా లోభః తస్మాదేతత్త్రయం త్యజేత్ ॥ **(16 : 21)**

కామ క్రోధ లోభములు (కోరికలు, కోపము, ఆశ) మూడు విధాలైన నరక ద్వారములు. ఇవి మనిషిని అథోగతిపాలు చేయును. కనుక ఈ మూడింటిని విడువవలెను.

ఏతైర్విముక్తః కౌంతేయ తమోద్వారైః త్రిభిర్నరః ।

ఆచరత్యాత్మనః శ్రేయః తతో యాతి పరాం గతిమ్ ॥ **(16 : 22)**

ఈ మూడు అజ్ఞాన ద్వారములనుండి విముక్తుడైన మానవుడు శ్రేయస్కరమైన పనులు చేసి తరువాత పరమగతిని పొందును.

యః శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః ।

న స సిద్ధిమావాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥ **(16 : 23)**

ఎవరు శాస్త్రములు తెలిపిన నియమములను వదలి కోరికల కారణమున విశృంఖలముగా ప్రవర్తించునో అతడు సుఖమునుగానీ, సిద్ధినిగానీ, పరమగతినిగానీ పొందడు.

తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ।

జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి ॥ **(16 : 24)**

నీవు చేయదగిన మరియు చేయదగని విషయములు తెల్పుటకు శాస్త్రమే ప్రమాణము. కనుక శాస్త్రము తెలిపిన విధంగా పనిని తెలుసుకొని చేయుము.

### 6.3.1 తపస్సులు :

దేవ ద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచమార్జవమ్ ।

బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్యతే ॥ **(17 : 14)**

దేవుని, బ్రాహ్మణుని, గురువును, పూజనీయులను పూజించుట, పరిశుద్ధి, సరళత్వము, బ్రహ్మచర్యము, అహింస, శారీరక తపస్సులనబడును.

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।

స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయమ్ తప ఉచ్యతే ॥ **(17 : 15)**

ఉద్రేకము కలిగింపక ప్రీతికరము, లాభకరము, సత్యము అయిన మాటలాడుట స్వయముగా చదివి తెసుకొనుట వాక్కునకు సంబంధించిన తపస్సనబడును.

మనఃప్రసాదః సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః ।

భావసంశుద్ధిరిత్యేతత్ తపో మానసముచ్యతే ॥ **(17 : 16)**

మనఃప్రసన్నత, శాంత స్వభావము, మౌనము, నిగ్రహము, పవిత్ర స్వభావము ఇవన్నియును మానసిక తపస్సులనబడును.

శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్ త్రివిధం నరైః ।

అఫలాకాంక్షిభిర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే ॥ **(17 : 17)**

దివ్యమైన (భగవంతునియందు) శ్రద్ధతో ఫలమునాశింపక చేయబడు తపస్సును సాత్త్విక తపస్సందురు.

సత్కారమానపూజార్థం తపో దంభేన చైవ యత్ ।

క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్ ॥ **(17 : 18)**

సన్మానము, గౌరవము, పూజలందుకొనుటకు కపటముతో చేయబడు తపస్సులను రాజస తపస్సులందురు. ఇవి అస్థిరంగా తాత్కాలికమైనవి.

మూఢగ్రాహేణాత్మనో యత్ పీడయా క్రియతే తపః ।

పరస్యోత్సాదనార్థం వా తత్తామసముదాహృతమ్ ॥ **(17 : 19)**

ఇతరులకు కీడు కలిగించుట కొరకు తాను బాధపడుతూ మూఢత్వముతో చేయబడు తపస్సులను తామస తపస్సులందురు.

## 6.3.2 విద్య :

**ప్రతి వానికీ విద్యనందించాలి. విద్యలో ఉండవలసినవి :**

– పెద్దలను గౌరవించుట, పిన్నలను ప్రేమతో చూచుట, అందరితో ఆప్యాయంగా వ్యవహరించుట, పంచయజ్ఞాలు (తల్లిదండ్రులను ప్రేమాభిమానాలతో చూచుకొనుట, అతిథులను ఆదరించుట, పశుపక్ష్యాదుల ఆలనాపాలన చూచుట, జ్ఞానార్జన, దైవస్తుతి), యమం, నియమం (చూడుము : 8.6 ధ్యానయోగం), ఇంద్రియ నిగ్రహం, మనోనిగ్రహం, దైవీ లక్షణాలు, శారీరక, వాచిక మానసిక తపస్సులు అలవరచుట,

– శరీర, గృహ, పరిసరాలను శుచిగా ఉంచుట,

– ఆరోగ్యం, ఆహారం, వ్యాయామం, రక్షణ, (ఎ.సి.సి., ఎన్.సి.సి., భారత్ స్కౌట్స్‌లో శిక్షణ),

– శరీర, గృహాలంకరణ, ఉద్యానవన పెంపు,

– హస్త కళలు, ఆటలు, పాటలు, నృత్యాలు,

– సమాజం, వ్యవస్థల జ్ఞానం

– జీవితం యొక్క అవగాహన, స్వశక్తి మీద ఆధారపడుట, అవసరమైనవారికి సహాయం చేయుట మొదలైనవన్నీ విద్యలో భాగంగా ప్రతివారికీ నేర్పాలి.

– స్వార్థాన్ని అణచి దేశాభివృద్ధికి తోడ్పడే వ్యక్తిత్వాన్ని పెంపొందింపజేయుట, కర్మయోగం నేర్పుట,

– సామాన్యంగా నిత్య జీవితంలో ఉపయోగపడే పనిముట్లను ఉపయోగించుట,

– కూడు, గుడ్డ, గూడు, ఇతర అవసరాలు, సౌఖ్యాలు, ఆడంబరాలకు సంబంధించిన వృత్తి విద్యలలో స్వయం ఉపాధి, కుటీర పరిశ్రమలు నెలకొల్పుకునే సామర్థ్యం,

– సమాజ, దేశ సమస్యలు, పరిష్కారాలు, పౌరుల బాధ్యతలు తదితర విషయాలు తప్పనిసరిగా నేర్పించుట,

– ఆపై జ్ఞాన విజ్ఞానాన్ని, వ్యాపార, పరిపాలన, న్యాయ, రక్షణ మొదలైన వ్యవస్థలలో ఉన్నత విద్య, పరిశోధనలు.

## 7.0 పాప ప్రక్షాళన :

ఈ జన్మలోగానీ, గత జన్మలలోగానీ చేసిన పాపాలు మిగిలివుంటే వాటి ఫలితంగా జీవితంలో కష్టనష్టాలు కలుగుతాయి. జీవితాన్ని సుఖవంతం చేసుకొనుటకు మిగిలివున్న పాపాలను మిగిలివుండకుండా ప్రక్షాళన చేసుకోవాలి. పాప ప్రక్షాళన చేసుకొను విధానాలను కొన్నింటిని ఈ క్రింద తెలిపారు.

దైవమేవా పరే యజ్ఞం మోగినః పర్యుపాసతే ।

బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి ॥ **(4 : 25)**

కొందరు యోగులు దేవతలను యజ్ఞము ద్వారా చక్కగా సేవింతురు. బ్రహ్మ జ్ఞానముగల మరికొందరు దేవతార్చన వదలి పరమాత్మయందే స్థితులౌదురు.

శ్రోత్రాదీనీంద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి ।

శబ్దాదీన్ విషయానన్య ఇంద్రియాగ్నిషు జుహ్వతి ॥ **(4 : 26)**

కొందరు జ్ఞానేంద్రియములను నిగ్రహమనెడి అగ్నిలో హోమము చేయుదురు. మరికొందరు జ్ఞానేంద్రియ విషయములను జ్ఞానేంద్రియములనెడి అగ్నియందే హోమము చేయుదురు. అనగా జ్ఞానేంద్రియ విషయములు మనసునకు చేరకుండా చేయుదురు.

సర్వాణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే ।

ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే ॥ **(4 : 27)**

ఇతరులు ఆత్మానుభవమును గోరి సకల ఇంద్రియ కర్మలను, ప్రాణ కర్మలను ఆత్మ సంయమ యోగమనెడి అగ్నియందు హోమము చేయుదురు.

ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞా యోగయజ్ఞాస్తథాపరే ।

స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయః సంశితవ్రతాః ॥ **(4 : 28)**

జ్ఞానవంతులు ద్రవ్యమును (సత్కార్యము కొరకు) వెచ్చించుట, తపస్సు చేయుట, యోగాభ్యాసము చేయుట, స్వయముగా (శాస్త్రములను) అధ్యయనము చేయుట, జ్ఞానయోగము మొదలగు కఠిన వ్రతములను ఆచరింతురు.

అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేపానం తథాపరే ।

ప్రాణాపానగతీ రుధ్వా ప్రాణాయామపరాయణాః ॥ **(4 : 29)**

(కొందరు) అపాన వాయువును నిశ్వాస యందు, అట్లే నిశ్వాసను అపాన వాయువు నందు అర్పించి, ఇతరులు ప్రాణ వాయువును, అపాన వాయువులను నిరోధించుదురు.

అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి ।

సర్వే ప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః ॥ **(4 : 30)**

మరికొందరు నియమితాహారమును స్వీకరించి, ప్రాణ వాయువునందే ప్రాణ వాయువును హోమము చేయుదురు. పైన తెలిపిన యజ్ఞములనాచరించి పాపప్రక్షాళన గావించుకొందురు.

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।

అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥ **(18 : 66)**

సర్వ ధర్మములను విడిచి కేవలం నన్నే (పరమాత్మునే) శరణుపొందుము. నేను (పరమాత్మ) సర్వ పాపములనుండి విముక్తుని గావింతును. విచారింపకుము.

యో మామజమనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్ ।

అసమ్మూఢః స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే ॥ **(10 : 3)**

ఎవడు భ్రాంతి లేనివాడై నన్ను పుట్టుక లేనివానిగను అనాదిగను సకల లోకములకు మహేశ్వరునిగను ఎరుగునో అతడు మరణించువారిలో సర్వపాపములనుండి ముక్తుడగును.

## 7.1 ముక్తి :

భౌతిక శరీరంతో జీవించువారు శారీరక అవసరాలను తీర్చుకొనుటకై పెక్కు కష్టములను అనుభవింతురు. కష్టములు లేకుండుటకు భౌతిక శరీరమును పొంది జన్మించకుండా ఉండవలెను. మోక్షమును పొందవలెను. అనగా శాశ్వత పరంధామమును చేరవలెను. అందులకు కర్మబంధముల నుండియు, రాగద్వేషములనుండియు ముక్తుడై పరమాత్ముని సదా ధ్యానించవలెను.

యజ్ఞ శిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనమ్ ।

నాయం లోకోస్త్యయజ్ఞస్య కుతోన్యః కురుసత్తమ ॥ **(4 : 31)**

యజ్ఞ ప్రసాదమును భుజించిన యోగులు పరబ్రహ్మమును పొందెదరు. యజ్ఞము చేయనివారికి ఈ లోకమునగానీ, పరలోకమునగానీ సుఖముండదు.

ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే ।

కర్మజాన్ విద్ధి తాన్ సర్వాన్ ఏవం జ్ఞాత్వా విమోక్ష్యసే ॥ **(4 : 32)**

(ఈవిధముగా) వేదముల ద్వారా తెలుపబడిన వివిధ యజ్ఞములు కర్మానుష్ఠానములని తెలిసికొని (శ్రద్ధగా ఆచరించి) ముక్తిని పొందెదవు.

జ్ఞేయః స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి ।

నిర్ద్వంద్వో హి మహాబాహో సుఖం బంధాత్ ప్రముచ్యతే ॥ **(5 : 3)**

ఎవరు ద్వేషముగాని కోరిక గానీ లేకుండునో అతడు నిత్య సన్యాసిగా తెలియబడును. రాగద్వేషములు, సుఖదుఖములు, మానవమానములు, జయాపజయములు, శీతోష్ణాలు మొదలగు ద్వంద్వములు లేనివాడు సుఖముగా బంధమునుండి ముక్తుడగును.

ఏషా తే భిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు ।

బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబంధం ప్రహాస్యసి ॥ **(2 : 39)**

ఇదంతయు (సమత్వ బుద్ధిని) సాంఖ్య (జ్ఞాన) యోగ దృష్టితో వివరించితిని. దానిని కర్మయోగ దృష్టితో కూడా వివరించెదను. దానిని తెలుసుకొని సమత్వ బుద్ధిగలవాడవై వ్యవహరించినచో కర్మ బంధముల నుండి విముక్తడవయ్యెదవు.

అన్యే త్వేమజానన్తః శృత్వాన్యేభ్య ఉపాసతే ।

తే అపి చాతితరన్త్యేవ మృత్యుం శృతిపరాయణాః ॥ **(13 : 25)**

మోక్ష మార్గములనెరుగనివారు తెలిసిన వారినుండి విని ఉపాసనలు (పూజలు) చేసి జనన మరణముల నుండి ముక్తులు కాగలరు.

## 7.2 మోక్షం :

అవ్యక్తముకన్ననూ అవ్యక్త భావమైన పరంధామమును (పరమాత్ముని ప్రదేశము) చేరినవారు తిరిగి జన్మించరు. ఆ స్థితిని పొందుట మోక్షమనబడును. మోక్షమునొందని వారు వారి పుణ్యము అయిపోయిన వెంటనే భౌతిక శరీరంతో జన్మింతురు.

పరస్తస్మాత్తు భావోన్యోవ్యక్తోవ్యక్తాత్ సనాతనః

యః స సర్వేషు భూతేషు  నశ్యత్సు న వినశ్యతి ॥ **(8 : 20)**

అవ్యక్తమైనదానికన్నా మరియొక అవ్యక్త భావము దివ్యమైనది, శాశ్వతమైనది ఏది కలదో అది సమస్త సృష్టి నశించినను నశించదు.

ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోర్జున ।

మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే ॥ **(8 : 16)**

బ్రహ్మ లోకము వరకునుగల లోకములు (నశించి) తిరిగి పుట్టినవి. (భౌతిక శరీరమును వదలినవారు కొందరు ఆ లోకములలో కొంతకాలముండి తిరిగి భౌతిక శరీరములో జన్మింతురు.) కాని నన్ను చేరి మరలా పుట్టుట జరగదు.

అవ్యక్తోక్షర ఇత్యుక్తః తమాహుః పరమాం గతిమ్ ।

యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ ॥ **(8 : 21)**

దేనిని పొంది మరల తిరిగి రారో అట్టి నా పరంధామము వ్యక్తము కానిది, నాశము లేనిదిగా చెప్పబడినది. అదే తుది గమ్యముగా తెలియబడినది.

న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః ।

యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ ॥ **(15 : 6)**

దేనిని పొంది తిరిగి రారో అట్టి నా నివాసము సూర్య చంద్రులచేగానీ, అగ్నిచేగానీ ప్రకాశింపబడదు.

యం హి న వ్యథయంత్యేతే పురుషం పురుషర్షభ ।

సమదుఃఖసుఖం ధీరం సోమృతత్వాయ కల్పతే ॥ **(2 : 15)**

సుఖ దుఖములకు కలతనొందని ధీరుడు మోక్షమునకు అర్హుడు.

వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః ।

బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః ॥ **(4 : 10)**

ఆసక్తి, భయము, కోపముల నుండి ముక్తుడై మనస్సును నాయందుంచి నన్నాశ్రయించిన పలువురు జ్ఞాన తపస్సుతో పవిత్రులై నన్ను పొందిరి.

అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా ।

పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్ ॥ **(8 : 8)**

ఇతర మార్గములో వెళ్ళకుండా యోగాభ్యాసముచే ఎల్లప్పుడునూ తలచుచూ దివ్యుడైన పరమ పురుషుని పొందును.

కవిం పురాణమనుశాసితారమ్ అణోరణీయాంసమనుస్మరేద్యః ।

సర్వస్య ధాతారమచింత్యరూపమ్ ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ ॥ **(8 : 9)**

ప్రయాణకాలే మనసాచలేన భక్త్యా యుక్తో యోగబలేన చైవ ।

భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్యసమ్యక్ స తం పరం పురుషముపైతి దివ్యమ్ ॥ **(8 : 10)**

సృష్టి రచయిత, ప్రాచీనుడు, సర్వాన్ని శాసించి నియమించువాడు, అణువుకన్నను సూక్ష్మమైనవాడు, అన్నిటినీ పోషించువాడు, ఊహింపశక్యముగాని రూపముగలవాడు, సూర్య తేజస్సు కలిగి తమస్సునకు అతీతుడు అయిన పరమాత్మను సర్వదా స్మరించుచూ మనసు నందు అచంచలమైన భక్తి కలిగినవాడు మరణ సమయమున యోగశక్తిచే కనుబొమల నడుమ ప్రాణవాయువును స్థాపించినవాడు దివ్యమైన పరమ పురుషుని పొందును.

యదక్షరం వేదవిదో వదంతి విశంతి యద్యతయో వీతరాగాః ।

యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే ॥ **(8 : 11)**

వేదములెరిగినవారు ఏ పరమ పధమును చెప్పుదురో, సన్యాసులైన యతులు దేనిలో ప్రవేశింతురో, దేనిని కోరి బ్రహ్మచర్యమునవలంబింతురో ఆ (పరమ) పధమును సంగ్రహముగా వివరింతును.

అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వాకలేవరమ్ ।

యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥ **(8 : 5)**

నన్ను స్మరించుచు దేహమును వదలినవాడు నిస్సందేహముగా నన్నే పొందును.

సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ ।

మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమ్ ఆస్థితో యోగధారణామ్ ॥ **(8 : 12)**

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్ ।

యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్ ॥ **(8 : 13)**

శరీరమునందలి అన్ని ద్వారములను నియంత్రించి మనస్సును హృదయమునందు నిరోధించి ఏకాగ్రతతో యోగస్థితిలో ప్రాణమున్నవాడై ఆత్మను శిరస్సునందు స్థాపించి, ఓంకారమును ఉచ్చరించుచూ నన్ను (పరమాత్మను) స్మరించుచు ఎవడు శరీరమును విడిచివెళ్ళునో అతను పరమగతిని పొందును.

క్షేత్రక్షేత్రజ్ఞయోరేవమ్ అంతరం జ్ఞానచక్షుషా ।

భూతప్రకృతిమోక్షం చయే విదుర్యాంతి తే పరమ్ ॥ **(13 : 34)**

శరీరమునకు, అందున్న ఎరిగినవానికి గల భేదమును, జీవుడు ప్రకృతి నుండి మోక్షమును పొందు విధానములను ఎవరు జ్ఞాన దృష్టితో తెలుసుకుంటారో వారు పరమాత్ముని చేరుదురు.

ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః ।

సర్గేపి నోపజాయన్తే ప్రలయే న వ్యథన్తి చ ॥ **(14 : 2)**

ఈ జ్ఞానమునాశ్రయించి నా స్వభావమును పొంది సృష్టి యందు ఎప్పుడును జన్మించరు. ప్రళయమునందు కూడా వ్యధనొందరు.

నిర్మానమోహా జితసంగదోషా అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః ।

ద్వంద్వైర్విముక్తాః సుఖదు:ఖసంజ్ఞైః గచ్ఛంత్యమూఢాః పదమవ్యయం తత్ ॥ **(15 : 5)**

దురభిమానము, మోహములు లేనివారు, ఆసక్తి అను దోషమును జయించినవారు, పరమాత్మయందు నిత్యము స్థితులైనవారు, కోరికల నుండి మరలినవారు, సుఖదుఖములవంటి ద్వంద్వములనుండి విముక్తులైనవారు, భ్రాంతిలేని వారు శాశ్వతమైనట్టి (పరమ) పథమును పొందుదురు.

మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్ ।

నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః ॥ **(8 : 15)**

నన్ను పొందిన మహాత్ములు ఉత్కృష్టమైన సంపూర్ణత్వమును పొంది దు:ఖములకు నిలయమై అశాశ్వతమైన పునర్జన్మను పొందరు.

## 8.0 మోక్ష సోపానాలు :

ఏవిధమైనటువంటి సందేహము లేకుండా శ్రద్ధతో పరమాత్ముని శరణుజొచ్చి కర్మయోగము లేక సాంఖ్య (సమత్వ బుద్ధి) యోగము లేక ధ్యాన యోగము చేసి పరమాత్ముని చూసి మోక్షమునొందగలరు.

ధ్యానేనాత్మని పశ్యన్తి కేచిదాత్మానమాత్మనా ।

అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥ **(13 : 24)**

పరమాత్ముని కొందరు ధ్యాన యోగము వలన తమయందే చూతురు. ఇతరులు సాంఖ్య యోగము వలన, మరికొందరు కర్మయోగము వలన కూడా చూచెదరు.

తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత ।

తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥ **(18 : 62)**

అన్ని విధముల వానినే శరణుజొచ్చుము. అతని అనుగ్రహముచే పరమశాంతిని శాశ్వత స్థానమును పొందగలవు.

అజ్ఞశ్చాశ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి ।

నాయం లోకోస్తి న పరో న సుఖం సంశయాత్మనః ॥ **(4 : 40)**

అజ్ఞాని, సందేహించువాడు, శ్రద్ధ లేనివాడు నశించును. సందేహించువానికి ఈ లోకమునగానీ పరలోకమునగానీ సుఖము లేదు.

## 8.1 కర్మ యోగము :

సన్న్యాసః కర్మయోగశ్చ నిఃశ్రేయసకరావుభౌ ।

తయోస్తు కర్మసన్న్యాసాత్ కర్మయోగో విశిష్యతే ॥ **(5 : 2)**

(కర్మ చేయకుండా) సన్యసించుట, కర్మయోగాచరణ రెండును మోక్షగామికి మేలు చేసేవే. కానీ ఆ రెండింటిలో కర్మ సన్యాసముకన్ననూ కర్మ యోగమే ఉత్తమమైనది.

జ్ఞేయః స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి ।

నిర్ద్వంద్వో హి మహాబాహో సుఖం బంధాత్ ప్రముచ్యతే ॥ **(5 : 3)**

ఎవరు దేనిని ద్వేషింపక దేనిని కోరకుండునో అతడు నిత్య సన్యాసిగా తెలియబడును. సుఖదుఃఖాది ద్వంద్వములు లేనివాడు సుఖముగా బంధములనుండి ముక్తుడు కాగలడు.

సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతి న పండితాః

ఏకమప్యాస్థితః సమ్యక్ ఉభయోర్విందతే ఫలమ్ ॥ **(5 : 4)**

సాంఖ్య (భౌతిక జగత్తు యొక్క విశ్లేషణాత్మక అధ్యయనము చేయువారు), కర్మ యోగములు భిన్నములని అల్పజ్ఞులు చెప్పుదురు. పండితులట్లు చెప్పరు. ఏ ఒక్కదానినైననూ ఆచరించెడివాడు ఆ రెండింటి యొక్క ఫలమైన పరమాత్మను పొందును.

యత్ సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే

ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి ॥ **(5 : 5)**

సాంఖ్య యోగులు పొందు స్థానమునే కర్మ యోగులును చేరుదురు. సాంఖ్య-కర్మ యోగములను ఒక్కటిగా చూసెడివాడే సరిగా చూసెడివాడు.

సన్న్యాసస్తు మహాబాహో దు:ఖమాప్తుమయోగతః ।

యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధిగచ్ఛతి ॥ **(5 : 6)**

అయోగ్యుడు సన్యాసాశ్రమున దు:ఖమును పొందును. పరమాత్మను స్మరించు కర్మయోగి పరమాత్మను శీఘ్రముగా పొందును.

యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః ।

సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే ॥ **(5 : 7)**

పరిశుద్ధమైన అంతఃకరణ కలిగి మనో నిగ్రహము కలగి ఇంద్రియములను జయించి సకల ప్రాణులయందును దయగల కర్మయోగి కర్మలనాచరించుచున్నను కర్మ ఫలములో బద్ధుడు కాడు.

బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః ।

లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా ॥ **(5 : 10)**

ఎవడు సంగత్వమును వదలి పరమాత్మునికి ధారపోయుచు పనులను చేయునో అతడు తామరాకు నీటిచే తడపబడని విధముగా పాపముచే ప్రభావితుడు కాడు.

స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః ।

స్వకర్మనిరతః సిద్ధిం యథా విందతి తచ్ఛృణు ॥ **(18 : 45)**

తమ స్వాభావిక కర్మల యందు నిరతులైన మానవులు సిద్ధిని పొందుదురు. అది ఏవిధముగా పొందునో వినుము.

యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్ ।

స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః ॥ **(18 : 46)**

ఎవరిచే సృష్టి అంతయూ వ్యాప్తమైనదో ఎవరినుండి సకల భూతములును ఆవిర్భవించినవో అట్టి పరమాత్మను మానవుడు తన స్వాభావిక కర్మలతో పూజించి సిద్ధిని పొందును.

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వమష్ఠితాత్ ।

స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥ **(18 : 47)**

చక్కగా చేయబడిన పరధర్మముకన్నా తక్కువ విలువగల స్వధర్మమే మేలు. స్వాభావిక కర్మనాచరించువాడు పాపమును పొందదు.

యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేర్జున ।

కర్మేంద్రియైః కర్మయోగమ్ అసక్తః స విశిష్యతే ॥ **(3 : 7)**

ఎవరు మనస్సుచే ఇంద్రియములను నియంత్రించి అనాసక్తుడై కర్మేంద్రియములతో కర్మయోగమునారంభించునో అతడు శ్రేష్ఠుడు.

నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః ।

శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః ॥ **(3 : 8)**

పని చేయకుండా జీవితము ఫలించదు. పని చేయకుండుటకన్నా నీ కర్తవ్యమును చేయుట మేలు.

యజ్ఞార్థాత్ కర్మణోన్యత్ర లోకోయం కర్మబంధనః ।

తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగః సమాచర ॥ **(3 : 9)**

పరమాత్ముని కొరకు కాక ఇతరమైన పనులు చేయుట వలన ఆ పనుల బంధములలో చిక్కుకొనెదవు. కనుక పరమాత్ముని కొరకు మాత్రము కర్తృత్వాభిమానము లేకుండా చక్కగా చేయుము.

సహయజ్ఞా ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।

అనేన ప్రసవిష్యధ్వమ్ ఏష వోస్త్విష్టకామధుక్ ॥ **(3 : 10)**

పూర్వము ప్రజలను యజ్ఞములతో సహా సృష్టించి ఇవి మీకు ఇష్టమైన వాటిని కామధేనువు వలె ఇచ్చును. దీనివలన శ్రేయస్సును పొందమని భగవానుడు పలికెను.

దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః ।

పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ ॥ **(3 : 11)**

ఈ యజ్ఞములచే దేవతలు తృప్తినొంది పంటలు, కాంతి, వాయువులతో మిమ్ములను తృప్తిపరచెదరు. పరస్పరం తృప్తిపరచుకొనుచు మీరు పరమ శ్రేయస్సును పొందగలరు.

ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః ।

తైర్దత్తానప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః ॥ **(3 : 12)**

యజ్ఞాచరణచే తృప్తినొందిన దేవతలు మీకు ఇష్టమైన భోగములను ఇవ్వగలరు. వారిచే ఇవ్వబడిన వాటిని ఆ దేవతలకు అర్పింపక ఎవరు తానే అనుభవించునో వారు దొంగలు.

యజ్ఞశిష్టాశినః సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః ।

భుంజతే తే త్వఘం పాపా యే పచంత్యాత్మకారణాత్ ॥ **(3 : 13)**

నివేదించిన ప్రసాదమును భుజించునట్టి భక్తులు సకల పాపములనుండి విముక్తులగుదురు. కేవలము తమకొరకే వండుకొనువారు ఘోర పాపమును అనుభవింతురు.

అన్నాద్భవంతి భూతాని పర్జన్యాదన్నసంభవః ।

యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః ॥ **(3 : 14)**

సకల ప్రాణులు అన్నము వలన పెరుగును. వర్షము నుండి అన్నము సంభవించును. యజ్ఞము వలన వర్షము కురియును. యజ్ఞము కర్మ చేయుట వలనే సాధ్యము.

కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్ ।

తస్మాత్ సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ ॥ **(3 : 15)**

యజ్ఞ కర్మ వేదము నుండి, వేద జ్ఞానము పరమాత్మ నుండి ఉద్భవించినవి. అందుచే సర్వవ్యాపకమైన పరమాత్మ యజ్ఞమునందే ప్రతిష్ఠింపబడియుండును.

ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః ।

అఘాయురింద్రియారామో మోఘం పార్థ స జీవతి ॥ **(3 : 16)**

ఈ విధముగా నిర్ణయింపబడిన పద్ధతిని అనుసరింపక ఇంద్రియ భోగాలతో పాపమయ జీవితము గడుపువాడు వ్యర్థజీవి.

యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనమ్ ।

నాయం లోకోస్త్యయజ్ఞస్య కుతోన్యః కురుసత్తమ ॥ **(4 : 31)**

యజ్ఞఫలమైన అమృతమును ఆస్వాదించినవారు సనాతనమైన పరబ్రహ్మమును చేరెదరు. యజ్ఞము చేయనివానికి ఈ లోకమునగానీ ఏ ఇతర లోకమునగానీ ఆనందము ఉండదు.

కర్మణ్యకర్మ యః పశ్యేత్ అకర్మణి చ కర్మ యః

స బుద్ధిమాన్ మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్ ॥ **(4 : 18)**

కర్మయందు అకర్మను అకర్మయందు కర్మను చూచువాడు అన్ని పనులను చేస్తున్నప్పటికినీ మనుషులలో బుద్ధిమంతుడు, యోగి.

యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః ।

జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః ॥ **(4 : 19)**

ఎవని పనులన్నియును కోర్కెల వలన సంకల్పించబడినవి కాకుండునో మరియు ఎవని పనులన్నియును జ్ఞానముచే బాగా యోచింపబడి చేయబడునో అట్టివానిని పండితుడని తెలిసినవారు చెప్పెదరు.

త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః ।

కర్మణ్యభిప్రవృత్తోపి నైవ కించిత్ కరోతి సః ॥ **(4 : 20)**

కర్మ ఫలముపై ఆసక్తిని విడిచి ఎల్లప్పుడును తృప్తి కలిగియుండి నిరాశ్రయులైనవాడు పనులు చేస్తున్నప్పటికినీ ఏమియు చేయనివాడే అగును (కర్మ ఫలములో చిక్కుకొనడు).

నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః ।

శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥ **(4 : 21)**

ఆశ లేకుండా చిత్తమును నిగ్రహించి తన సర్వస్వమును వదలి కేవలము శరీర పోషణ కొరకు పనిచేయువాడు పాపమును పొందడు.

యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః ।

సమః సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే ॥ **(4 : 22)**

యాదృచ్ఛికంగా లభించిన దానితో తృప్తుడై సుఖదు:ఖాది ద్వంద్వములకు అతీతుడై అసూయ లేనివాడై సిద్ధి అసిద్ధుల యందు సమత్వ భావము కలిగియుండెడివాడు పనులు చేయుచున్నప్పటికీ వాటి పాపపుణ్యాలలో చిక్కుకొనడు.

గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః ।

యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే ॥ **(4 : 23)**

గత అనుభవములనుండి సంపూర్ణముగా ముక్తుడై సదా ఆధ్యాత్మిక జ్ఞానము పొందవలెనను చిత్తము కలిగి యజ్ఞము (భగవత్సేవ) కొరకు మాత్రము పనులు చేయువాని కర్మలన్నియు పూర్తిగా లయమగును (కర్మ ఫలములు మిగిలివుండవు). కనుక ముక్తి పొందుటకు అర్హుడు.

బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్ ।

బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా ॥ **(4 : 24)**

బ్రహ్మార్పణము కొరకు హోమమునందు అర్పింపబడు హవిస్సు బ్రహ్మము, అగ్ని బ్రహ్మము, అర్పించువాడు బ్రహ్మము. ఈ బ్రహ్మ కర్మ నుండి పొందదగిన ఫలము కూడా బ్రహ్మమే.

### 8.1.1 నిష్కామ కర్మ :

నేహాభిక్రమనాశోస్తి ప్రత్యవాయో న విద్యతే ।

స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥ **(2 : 40)**

దీనిలో ప్రయత్నమునందు నష్టముగానీ హానిగానీ యుండదు. కొంచెమైనా ఈ ధర్మము మహత్తరమైన (మరణ) భయము నుండి రక్షించును.

వ్యవసాయాత్మికా బుద్ధిః ఏకేహ కురునందన ।

బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయో వ్యవసాయినామ్ ॥ **(2 : 41)**

ఇందులో ఒకే లక్ష్యంతో స్థిరమైన బుద్ధి ఉంటుంది. స్వార్థం కోసం పనిచేసేవారి బుద్ధి అసంఖ్యాకములై పెక్కు శాఖలు (కోరికల వలన) కలిగినవిగా ఉండును.

తస్మాదసక్తః సతతం కార్యం కర్మ సమాచర ।

అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః ॥ **(3 : 19)**

అందుచే ఎల్లప్పుడును స్వార్థము లేకుండా కర్తవ్య కర్మలను చేయుము. నిస్వార్థ కర్మ వలన మానవుడు పరమాత్మను పొందును.

కర్మణైవ హి సంసిద్ధిమ్ ఆస్థితా జనకాదయః ।

లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి ॥ **(3 : 20)**

జనకుడు మొదలైనవారు లోకహితార్థమై పనులు చేసి పరమసిద్ధిని పొందిరి. అందుకు నీవును తగుదువు.

యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః ।

స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥ **(3 : 21)**

శ్రేష్ఠుడు ఏమేమి చేస్తాడో ఇతరులు ఆయా పనులనే చేస్తారు. అతడు దేనిని ప్రమాణంగా చేస్తాడో లోకములో దానిని అనుసరించెదరు.

న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।

నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥ **(3 : 22)**

ముల్లోకములలో నాకు కర్తవ్యమేదియు లేదు. పొందదగినవానిలో పొందలేనిదేదియు లేదు. అట్లయినను నేను పనులలో నిమగ్నమై ఉన్నాను.

యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః

మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః ॥ **(3 : 23)**

ఎప్పుడైనా నేను శ్రద్ధతో పనులు చేయకుండిన యెడల మనుషులందరూ అన్ని విధములుగా నా మార్గముననుసరింతురు (పనులు చేయుట మానెదరు).

ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్ ।

సంకరస్య చ కర్తా స్యామ్ ఉపహన్యామిమాః ప్రజా ॥ **(3 : 24)**

ఒకవేళ నేను పనులు చేయుట మానినచో లోకములన్నియు నాశనమగును. లోకములలో అల్లకల్లోలము చెలరేగుటకు కారకుడనయ్యెదను. ప్రజలందరినీ నాశనము చేసినవాడనయ్యెదను.

న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ ।

ఉదాసీనవదాసీనం అసక్తం తేషు కర్మసు ॥ **(9 : 9)**

ఆ పనుల యెడ నిస్వార్థంగా ఉదాసీనుడనై ఉన్నట్టి నన్ను ఆ పనులన్నీ కూడా (కర్మఫలంతో) బంధింపవు.

యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతిమాప్నోతి నైష్ఠికీమ్ ।

అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే ॥ **(5 : 12)**

వివేకి కర్మఫలములను విడిచి నిశ్చలమైన శాంతిని పొందును. అవివేకి కోర్కెల కారణమున కర్మఫలములో ఆసక్తుడై బద్ధుడగును.

చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః ।

తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్ ॥ **(4 : 13)**

నాలుగు వర్ణాలవారిని (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర) వారి గుణ కర్మలననుసరించి నేనే సృష్టించిననూ శాశ్వతుడనైన నన్ను అకర్తనుగా తెలిసికొనుము.

న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా ।

ఇతి మాం యోభిజానాతి కర్మభిర్న స బధ్యతే ॥ **(4 : 14)**

పనులు నన్ను ప్రభావితము చేయవు. నాకు కర్మఫలాసక్తి లేదు. ఈ సత్యము నెరిగినవాడు కర్మఫలముచే బద్ధుడు కాకుండును.

ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పైర్వైరపి ముముక్షుభిః ।

కురు కర్మైవ తస్మాత్ త్వం పూర్వైః పూర్వతరం కృతమ్ ॥ **(4 : 15)**

పూర్వము ముక్తులైనవారు ఈవిధంగా తెలిసికొని పనులు చేశారు. నీవు కూడా వారివలెనే నీ పనులు చేయుము.

సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత ।

కుర్యాద్విద్వాంస్తథాసక్తః చికీర్షుర్లోకసంగ్రహమ్ ॥ **(3 : 25)**

పామరులు (కర్మఫలమునందు) ఆసక్తులై పనులు చేయునట్లు పండితులు లోకహితార్థము (కర్మఫలమునందు) అనాసక్తుడై (నిస్వార్థముగా) పనులు చేయవలెను.

న బుద్ధిభేదం జనయేత్ అజ్ఞానాం కర్మసంగినామ్ ।

జోషయేత్ సర్వకర్మాణి విద్వాన్ యుక్తః సమాచరన్ ॥ **(3 : 26)**

తమ కొరకు పనులయందాసక్తులైన పామరులకు మానసిక కలతలు కలిగించరాదు. పండితుడు అన్ని పనులను చక్కగా చేయుచు వారిని ఉత్సాహపరచవలెను.

ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేన భారత ।

సర్వభూతాని సమ్మోహం సర్గే యాంతి పరంతప ॥ **(7 : 27)**

ఇష్టాయిష్టాల వలన కలిగిన సుఖదు:ఖాది ద్వంద్వముల ప్రభావమున జగత్తునందలి ప్రాణులన్నియు జన్మిస్తూనే భ్రాంతినొందుచున్నవి.

యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ ।

తే ద్వంద్వమోహనిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః ॥ **(7 : 28)**

పుణ్య కార్యములు చేసి తమ పాపములను తొలగించుకొనినవాడు ద్వంద్వముల భ్రాంతి నుండి ముక్తుడై దృఢమైన భక్తితో నన్ను భజించెదరు.

సర్వకర్మాణ్యపి సదా కూర్వాణో మద్వ్యపాశ్రయః ।

మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్ ॥ **(18 : 56)**

నా ఆశ్రయమునందుండి ఎల్లప్పుడును అన్ని పనులను చేయుచును నా అనుగ్రహముచే నాశనము లేని శాశ్వత పదమును పొందును.

మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా ।

నిరాశీర్నిర్మమో భూత్వా యుద్ధస్వ విగతజ్వరః ॥ **(3 : 30)**

ఆత్మజ్ఞానివై ఆశ, మమతలు లేనివాడవై నీ కర్మలనన్నింటినీ నాకర్పించి వెనుదీయక యుద్ధము (పనులు) చేయుము.

యే మే మతమిదం నిత్యమ్ అనుతిష్ఠంతి మానవాః ।

శ్రద్ధావంతోనసూయంతో ముచ్యంతే తేపి కర్మభిః ॥ **(3 : 31)**

ఏ మానవులు నా ఈ మతమును అసూయ లేకుండా నిత్యము శ్రద్ధతో నిర్వహిస్తారో వారు కూడా కర్మబంధముల నుండి విడువబడుదురు.

యే త్వేతదభ్యసూయంతో నానుతిష్ఠంతి మే మతమ్ ।

సర్వజ్ఞానవిమూఢాంస్తాన్ విద్ధి నష్టానచేతసః ॥ **(3 : 32)**

ఎవరు నా ఈ మతమును అసూయనొందుచూ సక్రమముగా చేయరో వారు ఆత్మ చైతన్యమునందు నష్టమునొంది అన్ని జ్ఞానములందును విమూఢులైనవారిగా తెలిసికొనుము.

## 8.2 జ్ఞాన యోగం :

నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః ।

ఉభయోరపి దృష్టోంతః త్వనయోస్తత్త్వదర్శిభిః ॥ **(2 : 16)**

అసత్యమునకు ఉనికి లేదు. నిత్య సత్యమునకు మార్పు లేదు. ఆ సత్యమును తత్త్వదర్శులచే దర్శించబడి సారాంశము తెలుసుకొనబడినది.

శక్తి పదార్థముగా మారి, పదార్థముల నుండి పంచభూతాలు (ఆకాశము, అగ్ని, వాయువు, జలము, ధాతువలతో ఏర్పడిన భూమి) వాటి నుండి ప్రకృతిలోని వస్తువులు, ప్రాణుల శరీరాలు తయారవుతున్నవి. ఇవన్నియు ఎల్లప్పుడును మార్పులు చెందుతూ కొంత కాలమునకు విచ్ఛిన్నమగుచున్నవి. చివరికి పదార్థములన్నియు శక్తిగా మార్పు చెందును. అందువలన వస్తువులు, శరీరములు అశాశ్వతములు.

అశాశ్వతమైన శరీరములలో శాశ్వతమైన జీవాత్మలు చేరి జీవించుచున్నవి. ఈ ప్రపంచమున అశాశ్వతమైన భౌతిక వస్తువులు శరీరములకే గుర్తింపు కలదుగానీ శాశ్వతమైన ఆత్మలకు గుర్తింపు లేదు. శరీరము సజీవంగా ఉన్నంతవరకే ఆ జీవితమునకు గుర్తింపు. నిర్జీవమైన తరువాత కొద్ది కాలమునకే ఆ జీవితమును ప్రపంచములో మరచిపోవుదురు. జీవాత్మ కూడా ఆ జీవితమును అసత్యమైన ఒక స్వప్నముగా తలచును (మరచిపోవును). శాశ్వతమైన ఆత్మకు ఒక జీవిత కాలము అతి స్వల్పము. అందువలన అసత్యమైన జీవితమునకు ఉనికి లేదని, శాశ్వతమైన సత్యము (ఆత్మ)కు మార్పు లేదని తత్వజ్ఞానులు తెలుసుకొనిరి.

ఊర్ధ్వమూలమధశ్శాఖమ్ అశ్వత్థం ప్రాహురవ్యయమ్ ।

ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ ॥ **(15 : 1)**

మూలము (పరమాత్మ) పైనను శాఖలు (ప్రకృతి) క్రింద ఉండి వేద ఋక్కులు ఆకులుగా గల శాశ్వతమైన అశ్వత్థ వృక్షమును ఎవరు తెలుసుకొనునో అతడు వేదములనెరిగినవాడు.

అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖా గుణప్రవృద్ధా విషయప్రవాలాః ।

అధశ్చమూలాన్యనుసంతతాని కర్మానుబంధీని మనుష్యలోకే ॥ **(15 : 2)**

త్రిగుణములచే వృద్ధినొందించబడి క్రిందికి మరియు పైకి వ్యాపించిన కొమ్మలకు ఇంద్రియార్థములనెడి చిగురాకులు మరియు కర్మలకు సంబంధించిన మూలములు క్రింద మనుష్య లోకమున వ్యాపించినవి.

న రూపమస్యేహ తథోపలభ్యతే నాంతో న చాదిర్న చ సంప్రతిష్ఠా ।

అశ్వత్థమేనం సువిరూఢమూలమ్ అసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా ॥ **(15 : 3)**

తతః పదం తత్పరిమార్గితవ్యం యస్మిన్ గతా న నివర్తంతి భూయః ।

తమేవ చాద్యం పురుషం ప్రపద్యే యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ ॥ **(15 : 4)**

ఈ వృక్ష రూపము ఈ ప్రపంచమున తెలియబడదు. మొదలు చివర మూలము కనబడదు. మిక్కిలి దృఢమైన వేరులు గల ఈ అశ్వత్థ వృక్షమును వైరాగ్యమనెడి ఆయుధముచే బలముగా ఛేదించి తరువాత దేనిని చేరి తిరిగి వెనుకకు రారో ఆ పరమపథమును అన్వేషించవలెను. మరియు ఎవరినుండి అనాది కాలము ఆరంభమై వ్యాపించెనో ఆ ఆదిపురుషుని శరణు పొందవలెను.

పరమాత్ముని మూలముగా సృష్టి జరిగి ప్రకృతిలో ఇంద్రియార్థముల కారణంగా త్రిగుణముల వలన పనులు జరుగుచున్నవి. కాని ప్రపంచంలో ఈ సత్యము కనపడదు. అదే మాయ. అజ్ఞాని అయిన జీవి తానే పనులు చేస్తున్నానని తలుచును.

మోక్షమును పొందగోరువారు ఆ మాయనుండి బయటపడి జీవితము అశాశ్వతమైనదనియు, ఉనికి లేనిదనియు, కష్టనష్టములతో కూడిన వృధా ప్రయాసయనియు తెలుసుకొని వైరాగ్యంతో పరమాత్ముని శరణు పొందవలెను.

నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి ।

గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోధిగచ్ఛతి ॥ **(14 : 19)**

త్రిగుణములకన్నా ఇతరమైన కర్త లేదని నమ్మి త్రిగుణాతీతుడైనవానిని (పరమాత్ముని) ఎరిగినవాడు నా దివ్య భావమును పొందును.

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।

అహంకారవిమూఢాత్మా కర్తహమితి మన్యతే ॥ **(3 : 27)**

ప్రకృతి యొక్క త్రిగుణములచే చేయబడుచున్నట్టి అన్ని పనులకు తానే కర్త అని అహంకార విమూఢులైన జీవులు తలంచెదరు.

తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః ।

గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే ॥ **(3 : 28)**

కాని గుణ కర్మ విభాగ తత్త్వమునెరిగినవాడు గుణములు గుణములయందు పనిచేయుచున్నవని తలచి పనులయందు ఆసక్తి లేకుండును.

ప్రకృతేర్గుణసమ్మూఢాః సజ్జంతే గుణకర్మసు ।

తానకృత్స్నవిదో మందాన్ కృత్స్నవిన్న విచాలయేత్ ॥ **(3 : 29)**

ప్రకృతి గుణములచే మోహితులైన మూఢులు గుణకర్మల యందు ఆసక్తులగుదురు. అట్టి సత్యమునెరగని మందబుద్ధిగలవారిని సత్యమునెరిగినవారు కలతపెట్టరాదు.

వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః ।

బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః ॥ **(4 : 10)**

రాగభయక్రోధములనుండి ముక్తులై నాయందు భక్తితో నన్నాశ్రయించి పలువురు జ్ఞాన తపస్సుచే పవిత్రులై నా భావమును పొందిరి.

శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప ।

సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే ॥ **(4 : 33)**

ద్రవ్యమయ యజ్ఞముకన్నను జ్ఞాన యజ్ఞము గొప్పది. సమస్త కర్మలన్నియు జ్ఞానమునందే సమాప్తమునొందును.

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।

ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః ॥ **(4 : 34)**

అది తెలుసుకొని తత్త్వమును దర్శించిన జ్ఞానులను సేవించి ప్రణామములాచరించి ప్రశ్నించి జ్ఞానోపదేశమును పొందుము.

యద్ జ్ఞాత్వా న పునర్మోహమ్ ఏవం యాస్యసి పాండవ ।

యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి ॥ **(4 : 35)**

ఆ జ్ఞానమును తెలుసుకొని మరలా ఎప్పుడును మోహమునొందవు. పంచభూతములతో కూడిన సకలమును పరమాత్మనైన నాయందే చూడగలవు.

అపిచేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః ।

సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి ॥ **(4 : 36)**

ఒకవేళ పాపులందరికన్నా మహాపాపివైనప్పటికీ జ్ఞానమనెడి నౌకలో దుఃఖ సముద్రమును దాటెదవు.

యథైధాంసి సమిద్ధోగ్నిః భస్మసాత్కురుతేర్జున ।

జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥ **(4 : 37)**

మండుచున్న అగ్గి కట్టెలను భస్మముగా ఎట్లు చేయునో అట్లే జ్ఞానమనెడి అగ్ని కర్మ (ఫలము)లన్నింటిని భస్మముగా చేయును.

న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।

తత్స్వయం యొగసంసిద్ధః కాలేనాత్మని విందతి ॥ **(4 : 38)**

ఈ ప్రపంచమున జ్ఞానముతో సమానమైనది, పవిత్రమైనది మరొకటి లేదు. దానిని యోగాభ్యాసమొనర్చువాడు కాలక్రమమమున స్వయంగా తనయందే తెలుసుకొనును.

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేంద్రియః ।

జ్ఞానం లబ్ధ్వా పరామ్ శాంతిమ్ అచిరేణాధిగచ్ఛతి ॥ **(4 : 39)**

జ్ఞానార్జనయందు శ్రద్ధగలవాడు ఇంద్రియములను నియంత్రించి జ్ఞానమును పొందును.జ్ఞానమును పొంది శీఘ్రముగా పరమ శాంతిని పొందును.

యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయమ్ ।

ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ ॥ **(4 : 41)**

కర్మలను యోగమునందు వదలి జ్ఞానముచే సంశయములను తొలగించుకొనిన ఆత్మజ్ఞానిని కర్మలు (కర్మఫలముతో) బంధింపవు.

తస్మాదజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాత్మనః ।

ఛిత్త్వైనం సంశయం యోగమ్ ఆతిష్ఠోత్తిష్ఠ భారత ॥ **(4 : 42)**

కావున నీ హృదయమునందు అజ్ఞానము వలన పుట్టిన సంశయమును జ్ఞానమనెడి ఖడ్గముచే ఛేదించి యోగస్థితుడవై యుద్ధమునకు లెమ్ము.

అమానిత్వమదంభిత్వమ్ అహింసా క్షాంతిరార్జవమ్ ।

ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః ॥ **(13 : 7)**

ఇంద్రియార్థేషు వైరాగ్యమ్ అనహంకార ఏవ చ ।

జన్మమృత్యుజరావ్యాధిదు:ఖదోషానుదర్శనమ్ ॥ **(13 : 8)**

అసక్తిరనభిష్వంగః పుత్రదారగృహాదిషు ।

నిత్యం చ సమచిత్తత్వమ్ ఇష్టానిష్టోపపత్తిషు ॥ **(13 : 9)**

మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ ।

వివిక్తదేశసేవిత్వమ్ అరతిర్జనసంసది ॥ **(13 : 10)**

అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వాజ్ఞానార్థదర్శనమ్ ।

ఏతద్జ్ఞానమితి ప్రోక్తమ్ అజ్ఞానం యదతోన్యథా ॥ **(13 : 11)**

వినమ్రత కలిగియుండుట, గర్వము లేకుండుట, అహింస సహనము సరళత్వము కలిగియుండుట, గురువును సేవించుట, శుచి స్థిరత్వము ఆత్మనిగ్రహము కలిగివుండుట, ప్రాపంచిక విషయములయందు వైరాగ్యము, అహంకారము లేకుండుట, జనన మరణములందు వ్యాధి ముసలితనము దుఖ:ములనెడి దోషములను గుర్తించుట, భార్య పుత్ర గృహము మొదలగు వానియందు ఆసక్తి, సంగత్వము లేకుండుట, ఇష్టానిష్టప్రాప్తియందు సమభావము కలిగియుండుట, మరియు నాయందు మాత్రమే అచంచలమైన భక్తివుండుట, జనసాంగత్యము లేకుండా ఏకాంతవాసము, ఆత్మజ్ఞానమునందు స్థిరత్వము, తత్త్వజ్ఞానాన్వేషణ. ఇవన్నియు జ్ఞానము ఇతరములన్నియు అజ్ఞానమని చెప్పబడినది.

నైవ కించత్ కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ ।

పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్ ॥ **(5 : 8)**

ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్ నిమిషన్నపి ।

ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్ ॥ **(5 : 9)**

తత్త్వమునెరిగినవాడు నిశ్చయముగా నేనేమియు చేయుట లేదు అని తత్త్వ జ్ఞానముతో తలచును. చూచుచు, వినుచు, తాకుచు, వాసన చూచుచు, తినుచు, నడుచుచు, నిద్రించుచు, శ్వాస పీల్చుచు, మాట్లాడుచూ, విడుచుచు, గ్రహించుచు, తెరచుచు, మూయుచు, ఇవన్నియు చేయుచున్నప్పటికినీ ఇంద్రియములు ఇంద్రియార్థములలో వర్తించుచున్నవని భావించును.

జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ।

తేషామాదిత్యవత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥ **(5: 16)**

ఆ జ్ఞానముచే ఎవరియొక్క అజ్ఞానము నశింపజేయబడినదో వారి జ్ఞానము పరమాత్మను సూర్యునివలె ప్రకాశింపజేయును.

తద్బుద్ధయస్తదాత్మానః తన్నిష్ఠాస్తత్పరాయణాః ।

గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః ॥ **(5: 17)**

పరమాత్మయందు లగ్నమైన బుద్ధి, ఆత్మ,నిష్ఠలతో ఆశ్రయించినవారి జ్ఞానముచే కల్మషములు ప్రక్షాళింపబడి మోక్షమును పొందుదురు.

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।

మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే ॥ **(7: 14)**

త్రిగుణములతో కూడిన దివ్యమైన నా ఈ మాయ దాటశక్యము కానిది. ఎవరు నన్ను శరణుజొచ్చెదరో వారు ఈ మాయను దాటెదరు.

న మాం దుష్కృతినో మూఢాఃప్రపద్యంతే నరాధమాః ।

మాయయాపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః ॥ **(7: 15)**

దుష్టులు, అజ్ఞానులు, నరాధములు, మాయచే జ్ఞానము హరింపబడినవారు, అసుర లక్షణములనాశ్రయించినవారు నన్ను శరణునొందరు.

చతుర్విధా భజంతే మాం జనాః సుకృతినోర్జున ।

ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ॥ **(7: 16)**

నాలుగు విధములైన పుణ్యాత్ములు నన్ను సేవింతురు. ఆపదలలోనున్నవారు, (నన్ను) తెలుసుకొనదలచినవారు, సంపదను కోరువారు, జ్ఞానులు.

తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే ।

ప్రియో హిజ్ఞానినోత్యర్థమ్ అహం స చ మమ ప్రియః ॥ **(7: 17)**

వారిలో నిత్యము నాయందే భక్తితో ఉన్న జ్ఞాని విశేషమైన ప్రియుడు. జ్ఞానికి నేను నాకు అతడు మిక్కిలి ప్రియతములు.

ఉదారాః సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ ।

ఆస్థితః స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్ ॥ **(7 : 18)**

వీరందూ ఉదాత్తులే.కాని జ్ఞాని నావంటి వాడేనని నా అభిప్రాయము. అతడు నిశ్చయముగా నన్నే అత్యుత్తమ గమ్యముగా ఉన్న ఆత్మ కలవాడు.

బహునాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే ।

వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥ **(7 : 19)**

పెక్కు జన్మల తరువాత జ్ఞానవంతుడై వాసుదేవుడే సమస్తమని నన్ను శరణుజొచ్చును. అటువంటి మహాత్ములు చాలా అరుదు.

జరామరణమోక్షాయ మామాశ్రిత్య యతంతి యే ।

తే బ్రహ్మ తద్విదుః కృత్స్నమ్ అధ్యాత్మం కర్మ చాఖిలమ్ ॥ **(7 : 29)**

ముసలితనము మరణముల నుండి ముక్తిని పొందుటకు ఎవరు నన్నాశ్రయించి ప్రయత్నించెదరో వారు బ్రహ్మమును, ఆత్మజ్ఞానమును, కర్మలను, సర్వమును, సంపూర్ణముగా యదార్థముగా తెలిసికొందురు.

సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః ।

ప్రయాణకాలే పి చ మాం తే విదుర్యుక్తచేతసః ॥ **(7 : 30)**

జగత్తు పరమ పురుషుడైన పరమాత్మ, సకల జీవులలోని ఆత్మను అయిన నన్ను ఎవరు తెలుసుకుందురో వారు మరణ సమయమున కూడా నాయందు మనస్సునుంచి నన్నెరిగియుందురు.

జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మాముపాసతే ।

ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖః ॥ **(9 : 15)**

ఇతరులు జ్ఞాన యజ్ఞముచే యజ్ఞము చేయుచు నన్ను ఏకభావముతో, ద్వంద్వ భావముతో విశ్వరూపమున పెక్కు విధముల ఉపాసన చేసెదరు.

సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్ ।

వినశ్యత్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి ॥ **(13 : 27)**

అన్ని జవులయందు సమముగా ఉన్నటువంటి పరమాత్మను నశించువానిలో నశింపనివానిగా ఎవరు చూచునో అతడు నిజమును చూచును.

సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్ ।

న హినస్త్యాత్మనాత్మానం తతోయాతి పరాం గతిమ్ ॥ **(13 : 28)**

అంతటను సమముగానున్నట్టి పరమాత్మను సమముగా చూచువాడు మనస్సుయందు తనను తాను హీనపరచుకొనడు. అప్పుడతడు పరమగతిని పొందును.

ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః ।

యః పశ్యతి తథాత్మానమకర్తారం స పశ్యతి ॥ **(13 : 29)**

ప్రకృతిచే పనులన్నీ అన్నివిధములుగా చేయబడుచున్నవని ఎవడు చూచునో అతడు తనను అకర్తగా తెలుసుకొనును.

యస్త్వాత్మరతిరేవ స్యాత్ ఆత్మతృప్తశ్చ మానవః ।
ఆత్మన్యేవ చ సంతుష్టః తస్య కార్యం న విద్యతే ॥ **(3 : 17)**

ఆత్మయందు ఆనందమునొందుచు తృప్తినొంది సంతృప్తుడైనవానికి చేయవలసిన పని ఏమియు ఉండదు.

నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన ।
న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః ॥ **(3 : 18)**

అతడు ఈ ప్రపంచమున పనులు చేయుటవలనగానీ చేయకపోవుటవలనగానీ అతనికి ఎటువంటి ప్రయోజనము ఉండదు. అతనికి ఏ ప్రాణితోను స్వార్థపరమైన సంబంధముండదు.

యదాభూతపృథగ్భావమేకస్థమనుపశ్యతి ।
తత ఏవచ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా ॥ **(13 : 30)**

ఎప్పుడు సకల భూతముల భిన్నత్వములు ఏకత్వమునందే యున్నట్లు తెలుసుకొన ప్రయత్నించునో అప్పుడు బ్రహ్మ విస్తృతి గురించిన జ్ఞానమును పొందును.

క్షేత్రక్షేత్రజ్ఞయోరేవమంతరం జ్ఞానచక్షుసా ।
భూతప్రకృతిమోక్షం చయే విదుర్యాంతి తే పరం ॥ **(13 : 34)**

శరీరమునకు ఆత్మకు నడుమగల భేదమును, ప్రకృతి నుండి జీవుని మోక్షము పొందు విధానములను జ్ఞానదృష్టిచే ఎవరు తెలుసుకొందురో వారు పరమపథమును పొందుదురు.

యో మామేవమసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్ ।
స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత ॥ **(15 : 19)**

ఎవడు నన్ను ఈవిధముగా సందేహములేనివాడై పురుషోత్తముడనని ఎరుంగునో సర్వమునెరిగిన అతడు నన్ను అన్నివిధముల భక్తితో సేవించును.

ఇతి గుహ్యతమం శాస్త్రమ్ ఇదముక్తం మయానఘ ।
ఏతద్ బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ కృతకృత్యశ్చ భారత ॥ **(15 : 20)**

ఈవిధముగా మిక్కిలి రహస్యమైన ఈ శాస్త్రము నాచే తెలుపబడినది. పాపరహితులై దీనిని తెలుసుకొనిన బుద్ధిమంతులు తమ ప్రయత్నములయందు విజయవంతులు కాగలరు.

## 8.2.1 జ్ఞానం :

ద్వానిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ ।
క్షరఃసర్వాణి భూతాని కూటస్థోక్షర ఉచ్యతే ॥ **(15 : 16)**

లోకమునందు జీవులలో నశించునవి, నశించనివి అని ఇద్దరు పురుషులున్నారు. వారు నశించెడి భౌతికమైన సకల జీవులు నాశములేని ఆత్మ అని చెప్పబడెను.

ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః ।
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥ **(15 : 17)**

ముల్లోకములందును ప్రవేశించి పోషించు శాశ్వతమైన ఈశ్వరుడు, పరమాత్మ అని మరొక ఉత్తమ పురుషుడు కలదు.

యస్మాత్ క్షరమతీతోహమ్ అక్షరాదపి చోత్తమః ।
అతోస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః ॥ **(15 : 18)**

ఈ కారణము వలన నశించువానికన్నా ఇతరుడనై నశింపని జీవాత్మకన్నా ఉత్తముడనగుటచే లోకంలో వేదాలలో కూడా పరమపురుషోత్తముడని ప్రసిద్ధుడను.

ఇదం శరీరం కౌన్తేయ క్షేత్రమిత్యభిధీయతే ।

ఏతద్ యోవేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥ **(13 : 1)**

ఈ శరీరము క్షేత్రమని పిలువబడుచున్నది. దీనినెరిగిన వానిని (జీవాత్మ) క్షేత్రజ్ఞుడని దానినెరిగినవారిచే పిలువబడును.

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత ।

క్షేత్రక్షేత్రజ్ఞయోః జ్ఞానం యత్తద్ జ్ఞానం మతం మమ ॥ **(13 : 2)**

అన్ని క్షేత్రములయందున్న క్షేత్రజ్ఞులు నన్నుగా తెలుసుకొనుము. క్షేత్ర–క్షేత్రజ్ఞుల గురించిన జ్ఞానము ఏదో అది జ్ఞానమని నా అభిప్రాయము.

**(చూడుడు 1.0–1.5)**

అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్ ।

వినాశమవ్యయస్యాస్య న కశ్చిత్ కర్తుమర్హతి ॥ **(2 : 17)**

దేనిచే ఇదంతయు వ్యాప్తమై ఉన్నదో అట్టి నాశము లేనిదానిని తెలుసుకొనుము. ఈ నాశము లేనిదానిని నాశనము చేయుటకు ఎవ్వడునూ సమర్థుడు కాడు.

బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।

తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప ॥ **(4 : 5)**

నీకును నాకును పెక్కు జన్మలు గడిచినవి. వాటన్నింటినీ నేనెరుగుదును. నీవు ఎరుగవు.

అజోపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోపి సన్ ।

ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా ॥ **(4 : 6)**

పుట్టుకలేనివాడనయినప్పటికినీ నాశనము లేనివాడనయినప్పటికినీ సకల భూతములకు (పంచభూతాలతో కూడి వాటన్నంటికీ) ఈశ్వరుడనైనప్పటికీ నా మాయచే నా అధిష్ఠానాన ప్రకృతితో అవతరించుచుందును.

జన్మ కర్మ చ మే దివ్యమ్ ఏవం యో వేత్తి తత్త్వతః ।

త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోర్జున ॥ **(4 : 9)**

తత్త్వ జ్ఞానముతో నాయొక్క జన్మ కర్మలు కూడా దివ్యమైనవని ఎవరు తెలుసుకొనునో అతడు ఈ శరీరమును విడిచి మరల జన్మను ఎప్పుడును పొందడు. అతడు నన్ను పొందును.

యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహం ।

మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః ॥ **(4 : 11)**

నన్ను ఎవరు ఎట్లు శరణు వేడుదురో నేను వారిని అట్లే అనుగ్రహింతును. మానవులందరూ అన్ని విధముల నా మార్గమును అనుసరింతురు.

న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః ।

న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే ॥ **(5 : 14)**

లోకములో పరమాత్మ కర్మలను కలుగజేయడు. కర్తృత్వమును కలిగియుండడు. కర్మఫలమునంటడు, కర్మలను (సకల భూతముల) స్వభావమే చేయించును.

నాదత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః ।

అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః ॥ **(5 : 15)**

పరమాత్మ ఎవరియొక్కయు పాపమునుగాని పుణ్యమునుగాని ఎప్పుడును పొందదు. జీవుల జ్ఞానము అజ్ఞానముచే ఆవరించబడి మోహితులగుదురు.

భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్ ।

సుహృదం సర్వ భూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి ॥ **(5 : 29)**

యజ్ఞ తపస్సులకు భోక్తనుగా, అన్ని లోకములకు మహేశ్వరునిగా అన్ని భూతము (జీవు)లయందు దయగలవానిగా నన్ను తెలుసుకొనినవాడు శాంతిని పొందును.

మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ ।

మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥ **(7 : 7)**

నాకన్నను శ్రేష్ఠమైనది వేరొకటేదియును లేదు. సూత్రమున మణులవలె ఇదంతయు (సృష్టిలోనివన్నీ) నాయందు కూర్చబడియున్నవి.

రసోహమప్సు కౌంతేయ ప్రభాస్మి శశిసూర్యయోః ।

ప్రణవఃసర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు ॥ **(7 : 8)**

నీటియందలి రసమును, సూర్యచంద్రుల కాంతిని, వేదములయందలి ఓంకారమును, ఆకాశమునందలి శబ్దమును, పురుషులయందలి పౌరుషమును నేనే.

పుణ్యో గంధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ ।

జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు ॥ **(7 : 9)**

భూమియందలి పవిత్ర సుగంధమును, అగ్నియందలి తేజస్సు, అన్ని జీవులయందలి జీవము తాపసుల తపస్సును నేనే.

బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్ ।

బుద్ధిర్బుద్ధిమతామస్మి తేజస్తేజస్వినామహమ్ ॥ **(7 : 10)**

అన్ని భూతముల యొక్క సనాతనమైన మూలమును నన్నుగా తెలుసుకొనుము. బుద్ధిమంతుల బుద్ధిని నేనే. తేజస్సుగలవారి తేజస్సును నేనే.

బలం బలవతాం చాహం కామరాగవివర్జితమ్ ।

ధర్మావిరుద్ధో భూతేషు కామోస్మి భరతర్షభ ॥ **(7 : 11)**

బలవంతులలోని ఇష్టము, కోర్కెలు లేని బలమును నేనే. జీవులలోని ధర్మ విరుద్ధముకాని కామమును నేనే.

యే చైవ సాత్త్వికా భావా రాజసాస్తామసాశ్చయే ।

మత్త ఏవేతి తాన్ విద్ధి న త్వహం తేషుతే మయి ॥ **(7 : 12)**

సత్త్వరజస్తమో గుణములకు సంబంధించిన జీవుల భావములు నానుండే ఉద్భవించినవి. కాని నేను వానియందుండను. అవి నాయందుండును.

త్రిభిర్గుణమయైర్భావైః ఏభిః సర్వమిదం జగత్ ।

మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్ ॥ **(7 : 13)**

ఈ విశ్వమంతా త్రిగుణములను కూడి ఈ భావములచే మోహమునొంది వీనికన్నా ఉన్నతుడను అక్షయుడు అగు నన్ను తెలియలేకున్నది.

వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున ।

భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన ॥ **(7 : 26)**

గడచిన వాటిని వర్తమానంలో జరుగుతున్నవాటిని భవిష్యత్తులో జరిగెడు వాటిని మరియు జీవులందరినీ నేనెరుగుదును. కాని నన్నెవ్వడునూ ఎరుగరు.

అక్షరం బ్రహ్మ పరమం స్వభావోధ్యాత్మముచ్చతే ।

భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః ॥ **(8 : 3)**

నాశము లేనిది బ్రహ్మ. దివ్యమైన స్వభావము ఆత్మ. సకల భూతముల భావములను ఉద్భవింపజేయుట సృష్టికర్మ అని చెప్పబడుచున్నది.

అధిభూతం క్షరో భావః పురుషశ్చాధిదైవతమ్ ।

అధయజ్ఞోహమేవాత్ర దేహే దేహభృతాం వర ॥ **(8 : 4)**

నశించు స్వభావముగలవన్నియు (భౌతికమైనవి) అధిభూతము. నాశము లేని పురుషుడు అధిదైవతమ్. ఈ శరీరమునందు సకల కార్యములకు అధిష్ఠాతను నేనే అధియజ్ఞము.

పురుషః స పరః పార్థ భక్త్యా లభ్యస్త్వనన్యయా ।

యస్యాంతఃస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్ ॥ **(8 : 22)**

ఎవరియందు భౌతిక విశ్వమంతయు ఉన్నదో ఎవరిచే ఇదంతయూ వ్యాపించబడియున్నదో అట్టి పరమపురుషుడు భక్తితప్ప వేరే విధంగా లభ్యుడు కాడు.

రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిదముత్తమమ్ ।

ప్రత్యక్షవగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్ ॥ **(9 : 2)**

విద్యలలోను, రహస్య జ్ఞానములలోను రాజువంటి ఇది (ఈ జ్ఞానము) పవిత్రమైనది, ఉత్తమమైనది. ప్రత్యక్షానుభవముచే తెలియబడిన ఈ ధర్మము శాశ్వతమైనది, ఆచరణకు సుఖమైనది.

అశ్రద్ధధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప ।

అప్రాప్య మాం వివర్తంతే మృత్యుసంపారవర్త్మని ॥ **(9 : 3)**

ఈ ధర్మ విధానమునందు శ్రద్ధలేనివారు నన్ను పొందలేక మృత్యువుతో కూడిన సంసార మార్గమునకు తిరిగి వత్తురు.

మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా ।

మత్‌స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః ॥ **(9 : 4)**

ఈ సమస్త జగత్తు నా అవ్యక్త రూపముచే వ్యాప్తమైయున్నది. సకలము నాయందున్నవి. నేను వానియందు లేను.

న చ మత్థ్సాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్ ।

భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః ॥ **(9 : 5)**

సకలము నాయందున్నవి కావు కూడా. నా యోగశక్తిని చూడుము. నేను విశ్వమునందు లేను. సకలమును సృష్టించి పోషించువాడను.

యథాకాశస్థితో నిత్యం వాయుః సర్వత్రగో మహాన్ ।

తథా సర్వాణి భూతాని మత్థ్సానీత్యుపధారయ ॥ **(9 : 6)**

గొప్పదై అంతటను వీచునట్టి గాలి ఏవిధముగా ఆకాశమునందున్నదో అట్లే సకల భూతములు నాయందున్నవని గ్రహింపుము.

అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్ ।

పరం భావమజానంతో మమ భూతమహేశ్వరమ్ ॥ **(9 : 11)**

నేను దేహముతో అవతరించినప్పుడు మూఢులు నన్ను సరిగా తెలుసుకొనలేరు. సకలమునకును మహేశ్వరుడైన నా దివ్య స్వభావమును వారెరుగరు.

అహం క్రతురహం యజ్ఞః స్వధాహమహమౌషధమ్ ।

మంత్రోహమహమేవాజ్యమ్ అహమగ్నిరహం హుతమ్ ॥ **(9–16)**

నేనే క్రతువును, యజ్ఞమును, అర్పించబడు ఆహుతిని, ఔషధమును, మంత్రమును, నెయ్యి, అగ్ని, అగ్నిలో దహనమైది నేనే.

పితాహమస్య జగతో మాతా ధాతా పితామహః

వేద్యం పవిత్రమోంకార ఋక్సామ యజురేవ చ ॥ **(9–17)**

జగత్తున తల్లి, తండ్రి, పోషకుడు, తాత, తెలిసికొనదగినవాడు, పవిత్రము, ఓంకారము, ఋక్సామయజుర్వేదములు కూడా నేనే.

గతిర్భర్తా ప్రభుః సాక్షీ నివాసః శరణం సుహృత్ ।

ప్రభవః ప్రలయః స్థానం నిధానం బీజమవ్యయమ్ ॥ **(9–18)**

గమ్యము, భరించువాడు, ప్రభువు, సాక్షి, నివాసము, ఆశ్రయము, స్నేహితుడు, సృష్టి, ప్రళయము, స్థానము, విశ్రాంతి,శాశ్వతమైన ఆత్మ నేనే.

తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ ।

అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున ॥ **(9–19)**

(సూర్య రూపమున) వేడిని నేనే నీటిని (ఆవిరిగా) తీసుకొని వర్షముగా వదలెదను. అమృతము, మృత్యువు, సత్యమైన ఆత్మ, అసత్యమైన (అశాశ్వతమైన) ప్రకృతిని నేనే.

న మే విదుః సురగణాః ప్రభవం న మహర్షయః ।

అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః ॥ **(10–2)**

దేవతలకును, మహర్షులకు కూడా అన్ని విధముల నేనే మూలమును. వారు నా ప్రభావాన్ని తెలుసుకొనలేరు.

మహర్షయః సప్త పూర్వే చత్వారో మనవస్తథా ।

మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః ॥ **(10–6)**

పూర్వము సప్త ఋషులు, నలుగురు మనువులు నానుండియే ఉద్భవించిరి. లోకములో ప్రజలందరూ వారి మనస్సంకల్పముతో జన్మించిరి.

ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః ।

సోవికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః ॥ **(10–7)**

నా విభూతిని యోగశక్తిని యదార్థముగా తెలుసుకొనినవాడు నిరంతరాయమైన యోగములో నిమగ్నుడగును. ఇందు ఎట్టి సందేహము లేదు.

అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే ।

ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః ॥ **(10–8)**

నేను అన్నిటికినీ మూలమును. నావలననే జగత్తంతయు పనిచేయుచున్నది. అని తెలుసుకొనిన బుద్ధిమంతులు నన్ను భక్తి శ్రద్ధలతో భజింతురు.

**అర్జున ఉవాచ :**

పరం బ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్ ।
పురుషం శాశ్వతం దివ్యమ్ ఆదిదేవమజం విభుమ్ ॥ **(10–12)**

ఆహుస్త్వామ్ ఋషయః సర్వే దేవర్షిర్నారదస్తథా ।
అసితో దేవలో వ్యాసః స్వయం చైవ బ్రవీషి మే ॥ **(10–13)**

**అర్జున (భక్తుడు) పలికెను :**

నీవు పరబ్రహ్మ, పరంధామ, పవిత్రుడవు, పరమ పురుషుడవు, శాశ్వతుడవు, దివ్యుడవు, జన్మలేని ఆదిదేవుడవు, ఘనుడవు అని నిన్ను గురించి ఋషులందరును, దేవర్షి నారదుడు, అసితుడు, దేవలుడు, వ్యాసుడు, స్వయముగా నీవును నాకు చెప్పుచున్నావు.

సర్వమేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ ।
న హి తే భగవన్ వ్యక్తిం విదుర్దేవా న దానవాః ॥ **(10–14)**

నీవు నాకు తెలిపినదంతయు సత్యమేనని నేనంగీకరింతును. నీ స్వరూపమును దేవతలుగానీ దానవులుగానీ తెలుసుకొనజాలరు.

స్వయమేవాత్మనాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ ।
భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే ॥ **(10–15)**

ఓ పురుషోత్తమా, సర్వ కారణుడా, సర్వేశ్వరా, దేవదేవా, జగన్నాథా! నీవే స్వయముగా నిన్ను ఎరుగుదువు.

వక్తుమర్హస్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః ।
యాభిర్విభూతిభిర్లోకాన్ ఇమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి ॥ **(10–16)**

ఏ వైభవముచే ఈ లోకములందు వ్యాపించి ఉన్నావో ఆ దివ్య వైభవములను వివరముగా తెలుపుటకు నీవే తగుదువు.

**శ్రీ భగవాన్ ఉవాచ :**

హంత తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః ।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యంతో విస్తరస్య మే ॥ **(10–19)**

**శ్రీ భగవాన్ పలికెను :**

నా విస్తరణకు పరిమితి లేదు. ప్రముఖములైన నా దివ్య ప్రభావములను తెలిపెదను.

అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః ।
అహమాదిశ్చ మధ్యం  చ భూతానామంత ఏవ చ ॥ **(10–20)**

నేను సకల జీవుల హృదయములయందున్న ఆత్మను. సకల జీవులకు ఆది మధ్యాంతములు నేనే.

ఆదిత్యానామహం విష్ణుః జ్యోతిషాం రవిరంశుమాన్ ।
మరీచిర్మరుతామస్మి నక్షత్రాణామహం శశీ ॥ **(10–21)**

నేను ఆదిత్యులలో విష్ణువును. తేజస్సులలో ప్రకాశవంతమైన సూర్యుడను. మరుత్తులలో మరీచిని, నక్షత్రములలో (రాత్రివేళ ప్రకాశించువానిలో) చంద్రుడను.

వేదానం సామవేదోస్మి దేవానామస్మి వాసవః ।

ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా ॥ **(10–22)**

వేదాలలో సామవేదము నేనే. దేవతలలో ఇంద్రుడిని నేనే. ఇంద్రియములలో మనస్సు నేనే. జీవులలో చైతన్యము నేనే.

రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్ ।

వసూనాం పావకశ్చాస్మి మేరుః శిఖరిణామహమ్ ॥ **(10–23)**

రుద్రులలో శంకరుడను, యక్ష రాక్షసులలో కుబేరుడను, వసువులలో అగ్నిని, పర్వతములలో మేరువును నేనే.

పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్ ।

సేనానీనామహం స్కందః సరసామస్మి సాగరః ॥ **(10–24)**

పురోహితులలో ముఖ్యుడైన బృహస్పతిగా నన్ను తెలుసుకో. సేనాధిపతులలో నేను కార్తికేయుడను. జలనిధులలో సముద్రము నేనే.

మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరమ్ ।

యజ్ఞానాం జపయజ్ఞోస్మి స్థావరాణాం హిమాలయః ॥ **(10–25)**

నేను ఋషులలో భృగువును. శబ్దములలో ఓంకారమును. యజ్ఞములలో జప యజ్ఞమును. స్థావరములలో హిమాలయమును.

అశ్వత్థః సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః ।

గంధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః ॥ **(10–26)**

వృక్షములన్నింటిలో అశ్వత్థ వృక్షమును, దేవర్షులలో నారదుడను, గంధర్వులలో చిత్రరథుడను, సిద్ధులలో కపిల మునిని.

ఉచ్ఛైశ్రవసమశ్వానాం విద్ధి మామమృతోద్భవమ్ ।

ఐరావతం గజేంద్రాణాం నరాణాం చ నరాధిపమ్ ॥ **(10–27)**

అశ్వములలో అమృతముతో ఉద్భవించిన ఉచ్ఛైశ్రవముగా నన్ను తెలుసుకో. గజరాజములలో ఐరావతము, నరులలో రాజును (నేనే).

ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్ ।

ప్రజనశ్చాస్మి కందర్పః సర్పాణామస్మి వాసుకిః ॥ **(10–28)**

ఆయుధములలో వజ్రాయుధమును నేను. గోవులలో కామధేనువును నేను. సంతానోత్పత్తికి కారణమైన మన్మధుడను నేను. సర్పములలో వాసుకిని నేను.

అనంతశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్ ।

పితౄణామర్యమా ఆచస్మి యమః సంయమతామహమ్ ॥ **(10–29)**

నాగులలో అనంతుడను నేను. జలవాసులలో వరుణుడిని నేను. పితృదేవతలలో అర్యముడిని నేను. నియంత్రించువారిలో యముడను నేను.

ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్ ।

మృగాణాం చ మృగేంద్రో హం వైనతేయశ్చ పక్షిణామ్ ॥ **(10–30)**

దైత్యులలో ప్రహ్లాదుడను నేను. కొలతలలో కాలమును నేను. మృగములలో సింహమును నేను. పక్షులలో గరుత్మంతుడను.

పవనః పవతామస్మి రామః శస్త్రభృతామహమ్ ।

ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ ॥ **(10-31)**

పవిత్రమొనర్చువానిలో వాయువును నేను. శస్త్రధారులలో శ్రీరాముడను నేను. జలచరాలలో మొసలిని నేను. నదులలో గంగను నేను.

సర్గాణామాదిరంతశ్చ మధ్యం చైవాహమర్జున ।

అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్ ॥ **(10-32)**

సృష్టికి మొదలు మధ్య అంతము కూడా నేనే. విద్యలలో అధ్యాత్మ (బ్రహ్మ) విద్య, తర్కంలో నిర్ణయాత్మక వాదము నేనే.

అక్షరాణామకారోస్మి ద్వంద్వః సామాసికస్య చ ।

అహమేవాక్షయః కాలో ధాతాహం విశ్వతోముఖః ॥ **(10-33)**

అక్షరములలో 'అ'కారమును నేను.సమాసములలో ద్వంద్వ సమాసము నేను. శాశ్వతమైన కాలము నేను. విశ్వమును ధరించువాడను నేను.

మృత్యుః సర్వహరశ్చాహమ్ ఉద్భవశ్చ భవిష్యతామ్ ।

కీర్తిః శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా ॥ **(10-34)**

సకల ప్రాణులను హరింపజేయు మృత్యువును భవిష్యత్తులో పుట్టించువాడను నేనే. స్త్రీలలో కీర్తి, వైభవము, వాక్కు, జ్ఞాపకము, మేధస్సు, ధృతి, క్షమ నేనే.

బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసామహమ్ ।

మాసానాం మార్గశీర్షోహమ్ ఋతూనాం కుసుమాకరః ॥ **(10-35)**

సామవేదంలో బృహత్సామము, ఛందస్సులలో గాయత్రి, మాసములలో మార్గశిరము, ఋతువులలో వసంతము నేనే.

ద్యూతం ఛలయతామస్మి తేజస్తేజస్వినామహమ్ ।

జయోస్మి వ్యవసాయోస్మి సత్త్వం సత్త్వవతామహమ్ ॥ **(10-36)**

మోసములలో జూదమును నేను. తేజస్విలలో తేజస్సును నేను. జయము, నిశ్చయము, సాత్త్వికులలో సాత్త్వికత నేనే.

వృష్ణీనాం వాసుదేవోస్మి పాండవానాం ధనంజయః ।

మునీనామప్యహం వ్యాసః కవీనాముశనా కవిః ॥ **(10-37)**

వృష్ణి వంశజులలో వాసుదేవుడను, పాండవులలో ధనుంజయుడను, మునులలో వ్యాసుడను, కవులలో శుక్రాచార్యుడను.

దండో దమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్ ।

మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్ ॥ **(10-38)**

శిక్షించువారిలో దండమును, జయము కోరు వారి నీతిని, రహస్యములలో మౌనమును, జ్ఞానవంతుల జ్ఞానమును నేను.

యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున ।

న తదస్తి వినా యత్ స్యాత్ మయా భూతం చరాచరమ్ ॥ **(10-39)**

సకల జీవులలోని బీజమును నేను. నేను లేని జీవి, కదిలేదైనా కదలనిదైనా ఏదియును లేదు.

నాంతోస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప ।

ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా ॥ **(10-40)**

నా దివ్యములైన విభూతులకు అంతు లేదు. నేను తెలిపిన విభూతులు సూచనప్రాయము మాత్రమే.

యద్యద్విభూతిమత్ సత్త్వం శ్రీమదూర్జితమేవ వా ।

తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంశసంభవమ్ ॥ **(10–41)**

సృష్టిలో శక్తిగలిగినవి, సంపదగలవి, కాంతియుతమైనవన్నీ నా తేజస్సు యొక్క అంశతో సంభవించినవి.

అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున ।

విష్టభ్యాహమిదం కృత్స్నమ్ ఏకాంశేన స్థితో జగత్ ॥ **(10–42)**

ఇదంతా తెలుసుకోనవసరము లేదు. ఈ సమస్త జగత్తును నాయొక్క ఒక్క అంశ చేతనే వ్యాపించియున్నాను.

ఉపద్రష్టానుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః ।

పరమాత్మేతి చాప్యుక్తో దేహేస్మిన్ పురుషః పరః ॥ **(13–22)**

దేహమునందు ఈ పరమపురుషుని పర్యవేక్షకుడు, అనుమతించువాడు, భరించి పోషించువాడు, స్వీకరించువాడు, మహేశ్వరుడు, పరమాత్మ అని కూడా చెప్పబడినది.

అనాదిత్వాన్నిర్గుణత్వాత్ పరమాత్మాయమవ్యయః ।

శరీరస్థోపి కౌంతేయ న కరోతి న లిప్యతే ॥ **(13–31)**

ఆద్యంతములు లేనిదగుటచేతను గుణరహితమగుట చేతను పరమాత్మ క్షీణించదు. శరీరమున ఉన్నప్పటికినీ ఏమియు చేయదు. అందువలన కర్మబద్ధము కాదు.

యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః ।

క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత ॥ **(13–33)**

సూర్యుడొక్కడే ఈ లోకములను ప్రకాశింపజేయు రీతిలో ఆత్మ సకల శరీరములను ప్రకాశింపజేయును.

యథా సర్వగతం సౌక్ష్మ్యాత్ ఆకాశం నోపలిప్యతే ।

సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే ॥ **(13–32)**

ఆకాశము సర్వత్రా వ్యాపించియున్ననూ సూక్ష్మమగుట వలన దేనితోను ఏవిధముగా కలవదో అదేవిధముగా ఆత్మ సర్వత్రా ఉంటూనే శరీరములతో కలవదు.

యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఖిలమ్ ।

యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ॥ **(15–12)**

సూర్య చంద్ర అగ్నిలయందున్న ఏ తేజస్సు జగత్తును ప్రకాశింపజేయునో ఆ తేజస్సు నానుండియే అని తెలుసుకొనుము.

గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా ।

పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః ॥ **(15–13)**

నేను గ్రహములయందు ప్రవేశించి సకల జీవులను నా శక్తిచే ధరించి పోషించుచున్నాను. మరియు అన్ని ఓషధులకు రసమును సమకూర్చునట్టి చంద్రుడను.

అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।

ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥ **(15–14)**

ప్రాణుల దేహములయందు ప్రాణాపాన వాయువులతో కూడి నాలుగు విధములైన ఆహారమును జఠరాగ్ని రూపములో జీర్ణము చేయుచున్నాను.

సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిర్ జ్ఞానమపోహనం చ ।

వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాంతకృద్వేదవిదేవ చాహమ్ ॥ **(15-15)**

మరియు అందరి హృదయములయందు ఉన్నాను. నా నుండి జ్ఞాపక శక్తి, జ్ఞానము, మరపు కలుగుచున్నవి. నేనే వేదాంతకర్తను. వేదములనెరిగినవాడను. వేదముల ద్వారా తెలియదగినవాడను.

ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి ।

భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ॥ **(18-61)**

అన్ని జీవుల హృదయములయందుండు ఈశ్వరుడను. జీవులన్నింటినీ మాయచే యంత్రముపైనున్న వారివలె భ్రమింపజేయుచున్నాను.

య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ ।

సర్వథా వర్తమానోపి న స భూయోభిజాయతే ॥ **(13-23)**

ఎవడు ఈవిధముగా గుణసహిత ప్రకృతిని పురుషుని (ఆత్మను) తెలుసుకొనునో అతడు అన్ని విధముల ప్రవర్తించుచున్నప్పటికినీ మరల జన్మించడు.

అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ।

తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥ **(9-22)**

ఇతర చింతనలు లేక ఎవడు నన్నే నిత్యము ఉపాసిస్తాడో వాని యోగ క్షేమములను నేనే వహింతును (కలిగించెదను).

## 8.2.2 విశ్వరూపం :

**శ్రీ భగవాన్ ఉవాచ :**

పశ్య మే పార్థ రూపాణి శతశోథ సహస్రశః ।

నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ ॥ **(11-5)**

**శ్రీ భగవానుడు పలికెను.**

లక్షలకొలదిగా గల చాలా ఆకృతులు పెక్కు వర్ణములు కలిగినట్టి దివ్యములైన నా రూపములను చూడుము.

పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రాన్ అశ్వినౌ మరుతస్తథా ।

బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత ॥ **(11-6)**

ఆదిత్యులను, వసువులను, రుద్రులను, అశ్వినీ కుమారులను, మరుత్తులను, అట్లాగే గతములో చూడనటువంటి ఆశ్చర్యపరిచే పెక్కు విషయములను చూడుము.

ఇహైకస్థం జగత్ కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్ ।

మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి ॥ **(11-7)**

ఇందులో ఒకే చోట ఒక్కమారుగా మొత్తము విశ్వమును చరాచర జీవులతోసహా చూడుము. నా దేహమున నీవు చూడదలచిన మరిదేనినైనా చూడుము.

న తు మాం శక్య సే ద్రష్టుమ్ అనేనైవ స్వచక్షుషా ।

దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ ॥ **(11-8)**

కాని ఈ నీ కళ్ళతో నన్ను చూడలేవు. నీకు దివ్య నేత్రములనొసగుదును. నా యోగ వైభవమును చూడుము.

**సంజయ ఉవాచ :**

ఏవముక్త్వా తతో రాజమ్ మహాయోగేశ్వరో హరిః ।

దర్శయామాస పార్థియం పరమం రూపమైశ్వరమ్ ॥ **(11-9)**

ఈ విధముగా పలికి భగవానుడు దివ్యమైన ఐశ్వర్యవంతమైన తన (విశ్వ) రూపమును చూపెను.

అనేకవక్త్రనయమ్ అనేకాద్భుతదర్శనమ్ ।

అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్ ॥ **(11-10)**

దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనమ్ ।

సర్వాశ్చర్యమయం దేవమ్ అనంతం విశ్వతోముఖమ్ ॥ **(11-11)**

అది పెక్కుముఖములు పెక్కు నేత్రములుగల అద్భుతమైన దర్శనము. పెక్కు దివ్యాభరణములు, పెక్కు దివ్యాస్త్రములతో దివ్యమైన మాలలు, దివ్య సుగంధములు పూసిన వస్త్రధారణతో అంతా ఆశ్చర్యమైన విశ్వవ్యాపకమైన అంతులేని దేవుడు.

దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా ।

యది భాః సదృశీ సాస్యాత్ భాసస్తస్య మహాత్మన ః ॥ **(11-12)**

ఆకాశమున వేలకొలది సూర్యులు ఒకేసారి ఉదయించి ఉంటే ఆ కాంతి పరమాత్మని తేజస్సుకు సమము కావచ్చును.

తత్రైకస్థం జగత్ కృత్స్నం ప్రవిభక్తమనేకధా ।

అపశ్యద్దేవదేవస్య శరీరే పాండవస్తదా ॥ **(11-13)**

అచట ఒకేచోట అనేక విధములుగా విభజింపబడిన విశ్వమంతటినీ దేవదేవుని శరీరమున గాంచెను.

తతః స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః ।

ప్రణమ్య శిరసా దేవం కృతాంజలిరభాషత ॥ **(11-14)**

విశ్వ రూపమును గాంచిన అర్జునుడు ఆశ్చర్యముతో రోమాంచితుడై దేవదేవునికి శిరసు వంచి చేతులు జోడించి నమస్కరించి పలికెను.

పశ్యామి దేవాంస్తవ దేవ దేహే సర్వాంస్తథా భూతవిశేషసంఘాన్ ।

బ్రహ్మాణమీశం కమలాసనస్థమ్ ఋషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్ ॥ **(11-15)**

దేవా! నీ శరీరమున సర్వమును పెక్కు జీవ సమూహాన్ని, కమలాసన స్థితులైన బ్రహ్మ, ఈశ్వరులను, దేవతలను, ఋషులెల్లరను, దివ్య సర్పములను చూచుచున్నాను.

అనేకబాహూదరవక్త్రనేత్రం పశ్యామి త్వాం సర్వతోనంతరూపమ్ ।

నాంతం న మధ్యం న పునస్తవాదిం పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప ॥ **(11-16)**

పెక్కు చేతులు, ఉదరములు, ముఖములు, కన్నులతో మొదలు మధ్య చివరలు లేకుండా అంతటా వ్యాపించియున్న అంతులేని నీ రూపమును చూచుచున్నాను. విశ్వమే నీ రూపముగాగల విశ్వానికి ఈశ్వరా!

కిరీటినం గదినం చక్రిణం చ తేజోరాశిం సర్వతో దీప్తిమంతమ్ ।

పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమంతాత్ దీప్తానలార్కద్యుతిమప్రమేయమ్ ॥ **(11-17)**

కిరీటములతో, గదలతో, చక్రములతో అంతటా ప్రకాశింపజేయునట్టి గొప్ప తేజస్సుతో ఉన్న నిన్ను చూచుచున్నాను. అపరిమితమైన వెలుగుచున్న అగ్ని, సూర్యకాంతులతో చూచుటకు కష్టముగా ఉన్నది.

త్వమక్షరం పరమం వేదితవ్యం త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।

త్వమవ్యయః శాశ్వతధర్మగోప్తా సనాతనస్త్వం పురుషో మతో మే ॥ **(11-18)**

నీవు శాశ్వతుడవు, దివ్యుడవు, తెలియదగినవాడవు. నీవు ఈ విశ్వమునకు దివ్యమైన ఆధారము. నీవు అక్షయుడవు. శాశ్వత ధర్మ రక్షకుడవు. నీవు శాశ్వతుడవు. పరమ పురుషుడవు అని నా అభిప్రాయము.

అనాదిమధ్యాంతమనంతవీర్యమ్ అనంతబాహుం శశిసూర్యనేత్రమ్ ।

పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం స్వతేజసా విశ్వమిదం తపంతమ్ ॥ **(11-19)**

మొదలు మధ్య చివరలు లేని అంతులేని శక్తిమంతుడవు. అంతులేనన్ని చేతులతో సూర్య చంద్రులే నేత్రములుగా గలిగి ప్రజ్వరిల్లుతున్న నీ ముఖ తేజస్సుతో ఈ విశ్వమును తపింపజేయుచున్న నిన్ను చూచుచున్నాను.

ద్యావాపృథివ్యోరిదమంతరం హి వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః ।

దృష్ట్వాద్భుతం రూపముగ్రం తవేదం లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్ ॥ **(11-20)**

భూమి ఆకాశములందంతటను, అన్ని దిక్కులను నీచే ఆవరింపబడి ఆశ్చర్యము, భయంకరములైన నీ రూపమును చూజి ముల్లోకములు కలతనొందినవి.

అమీ హి త్వాం సురసంఘా విశంతి కేచిద్భీతాః ప్రాంజలయో గృణంతి ।

స్వస్తీత్యుక్త్వా మహర్షిసిద్ధసంఘాః స్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః ॥ **(11-21)**

దేవతా సమూహములు నీలో ప్రవేశించుచున్నారు. వారిలోకొందరు భయముతో నమస్కరిస్తూ శాంతి ప్రార్థనలు చేయుచున్నారు. ఋషులు సిద్ధులు నిన్ను పెక్కు స్తుతులతో స్తోత్రము చేయుచున్నారు.

రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యాః విశ్వేశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ ।

గంధర్వయక్షాసురసిద్ధసంఘాః వీఓంతే త్వాం విస్మితాశ్చైవ సర్వే ॥ **(11-22)**

రుద్రులు, ఆదిత్యులు, వసువులు, సాధ్యులు, విశ్వేదేవతలు, అశ్వినీ కుమారులు, మరుత్తులు, పితృ దేవతలు, గంధర్వులు, యక్షులు, అసురులు, సిద్ధులు, అందరూ ఆశ్చర్యమునొంది నిన్ను చూచుచున్నారు.

రూపం మహత్తే బహువక్త్రనేత్రం మహాబాహో బహుబాహూరుపాదమ్ ।

బహూదరం బహుదంష్ట్రాకరాళం దృష్ట్వా లోకాః ప్రవ్యథితాస్తథాహమ్ ॥ **(11-23)**

మహాబాహో! పెక్కు ముఖములు, నేత్రములు, చేతులు, తొడలు, పాదములు, ఉదరములు, కోరలుగల మహత్తరమైన నీ రూపమును చూచి, నేను, అన్ని లోకములు వ్యధ చెందినాము.

నభఃస్పృశం దీప్తమనేకవర్ణం వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్ ।

దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా ధృతిం న విందామి శమం చ విష్ణో ॥ **(11-24)**

ఓ విష్ణూ! తేజోమయ విశాల నేత్రములతో పెక్కు వర్ణములతో ప్రకాశిస్తూ ఆకాశమునంటుచూ విస్తరించియున్న ముఖములతో ఉన్న నిన్ను చూచి వ్యథిత మనస్సు కలవాడనై శాంతిని స్థిరత్వమును పొందలేకున్నాను.

దంష్ట్రాకరాళాని చ తే ముఖాని దృష్ట్వైవ కాలానలసన్నిభాని ।

దిశో న జానే న లభే చ శర్మ ప్రసీద దేవేశ జగన్నివాస ॥ **(11-25)**

నీ భయంకరమైన దంతములు, ప్రళయకాలాగ్నివలెనున్నముఖములను చూచి దిక్కులు తెలియకున్నాను. శాంతిని పొందకున్నాను. దేవేశా! జగన్నివాసా! (నన్ను) అనుగ్రహింపుము.

యథా నదీనాం బహవోంబువేగాః సముద్రమేవాభిముఖా ద్రవంతి ।

తథా తవామీ నరలోకవీరాః విశంతి వక్త్రాణ్యభివిజ్వలంతి ॥ **(11-28)**

పెక్కు నదుల ప్రవాహములు సముద్రమునకు ప్రవహించు విధముగా ఈ నరలోక వీరులు నీ నోళ్ళయందు ప్రవేశించి మండిపోవుచున్నారు.

యథా ప్రదీప్తం జ్వలనం పతంగాః విశంతి నాశాయ సమృద్ధవేగాః ।

తథైవ నాశాయ విశంతి లోకాః తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః ॥ **(11-29)**

శలభములు (తమ) నాశము కొరకై జ్వలించు అగ్నియందు ప్రవేశించు విధముగా జనులందరునూ వినాశము కొరకు నీ నోళ్ళయందు అత్యంత వేగముగా ప్రవేశించుచున్నారు.

లేలిహ్యసే గ్రసమానః సమంతాత్ లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః ।

తేజోభిరాపూర్య జగత్ సమగ్రం భాసస్తవోగ్రాః ప్రతపంతి విష్ణో ॥ **(11-30)**

మండుచున్న ముఖములతో అన్నివైపులనుండి జనులందరినీ నాకుచు, మ్రింగుచు విశ్వమంతటినీ భయంకరమైన నీ తేజో కాంతులతో ఆవరించి తపింపజేయుచున్నావు.

ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో నమోస్తు తే దేవవర ప్రసీద ।

విజ్ఞాతుమిచ్ఛామి భవంతమాద్యం న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్ ॥ **(11-31)**

ఉగ్రరూపా! వందనములు. దేవరా! నా యెడ ప్రసన్నుడవు కమ్ము. నీ కార్యమునెరుగను. ఆదిపురుషా! నిన్ను తెలియగోరుచున్నాను. నీవెవరివో నాకు దయతో వివరింపుము.

**భగవానుని ఉవాచ :**

కాలోస్మి లోకక్షయకృత్ ప్రవృద్ధో లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః ।

ఋతే పి త్వాం న భవిష్యంతి సర్వే యేవస్థితాః ప్రత్యనీకేషు యోధాః ॥ **(11-32)**

**భగవానుడు పలికెను :**

నేను లోకములను క్షీణింపజేయు కాలమును. ఇక్కడ జనులను నాశనము చేయుటయందు నిమగ్నుడనైయున్నాను. ఇక్కడ యోధులందరిలో నీవుతప్ప ఎవరునూ ఉండరు.

**అర్జున ఉవాచ :**

స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా జగత్ప్రహృష్యనురజ్యతే చ ।

రక్షాంసి భీతాని దిశో ద్రవంతి సర్వే నమస్యంతి చ సిద్ధసంఘాః ॥ **(11-36)**

హృషీకేశా! నిన్ను కీర్తించుచు జగత్తంతయు సంతసించి అనురక్తమగుచున్నది. సిద్ధులందరను నమస్కరించుచున్నారు. రాక్షసులు భయపడి అన్ని దిక్కులకు పారిపోవుచున్నారు.

కస్మాచ్చ తే న నమేరన్ మహాత్మన్ గరీయసే బ్రహ్మణోప్యాదికర్త్రే

అనంత దేవేశ జగన్నివాస త్వమక్షరం సదసత్ తత్పరం యత్ ॥ **(11-37)**

మహాత్మా! బ్రహ్మకన్నను గొప్పవాడవు. ఆదికర్తవు. అనంతా! దేవేశా! జగన్నివాసా! నీవు నాశము లేనివాడవు. సత్ అసత్తులకతీతుడవగుట వలన అందరూ నీకు నమస్కరింతురు.

త్వమాదిదేవః పురుషః పురాణః త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।

వేత్తాసి వేద్యం చ పరం చ ధామ త్వయా తతం విశ్వమనంతరూప ॥ **(11-38)**

అనంతరూపా! నీవు ఆదిదేవుడవు. పురాణ పురుషుడవు. ఈ విశ్వమునకు పరమాశ్రయుడవు. తెలిసినవాడవు. తెలియదగినవాడవు. పరంధాముడవు. విశ్వము నీచే వ్యాప్తమై ఉన్నది.

వాయుర్యమోగ్నిర్వరుణ శ్శశాంకః ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ ।
నమో నమస్తేస్తు సహస్రకృత్వః పునశ్చ భూయోపి నమో నమస్తే ॥ **(11-39)**

నీవు వాయువు, అగ్ని, యముడు, వరుణ, చంద్ర, బ్రహ్మ, బ్రహ్మకును జనకుడవు. నీకు వేలకొలది నమస్కారములు.

నమః పురస్తాదథ పృష్ఠతస్తే నమోస్తుతే సర్వత ఏవ సర్వ ।
అనంతవీర్యామితవిక్రమస్త్వం సర్వం సమాప్నోషి తతోసి సర్వః ॥ **(11-40)**

నీకు ముందునుండి, వెనుకనుండి, అన్నివైపులనుండి నమస్కరిస్తున్నాను. సమస్తము నీవే గనుక. అపరిమిత శక్తిగల విక్రముడవు. నీవే సర్వం.

పితాసి లోకస్య చరాచరస్య త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్ ।
న త్వత్సమోస్త్యభ్యధికః కుతోన్యో లోకత్రయేప్యప్రతిమప్రభావ ॥ **(11-43)**

చరాచరములకు లోకములకు తండ్రివి. పూజనీయుడవు గురువువు. మహనీయుడవు. నీతో సమానుడుండడు. అపరిమిత శక్తిసంపన్నుడా! నిన్ను మించిన వాడుండుట ఎట్లు సాధ్యము?

తస్మాత్ ప్రణమ్య ప్రణిధాయ కాయం ప్రసాదయే త్వామహమీశమీడ్యమ్ ।
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్ ॥

ప్రభూ! కుమారుని యెడ తండ్రివలె మిత్రుని యెడ మిత్రునివలె ప్రియురాలి యెడ ప్రియునివలె సహించుటకు తగుదువు. అందుచే పూజనీయ దేవదేవుడైన నిన్ను నేను కరుణ వేడి సాష్టాంగపడి నమస్కరించుచున్నాను. **(11-44)**

అదృష్టపూర్వం హృషితోస్మిదృష్ట్వా భయేన చ ప్రవ్యథితం మనో మే ।
తదేవ మే దర్శయ దేవరూపం ప్రసీద దేవేశ జగన్నివాస ॥ **(11-45)**

పూర్వము చూడనిది చూసి సంతసించితిని. నా మనస్సు భయముచే కలతనొందినది. దేవేశా! జగన్నివాసా! ప్రసన్నుడవు కమ్ము. నాకు నీ దేవ రూపమును చూపుము.

**శ్రీ భగవానువాచ :**

మా తే వ్యథా మా చ విమూఢభావో దృష్ట్వా రూపం ఘోరమీదృఙ్మ మేదమ్ ।
వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం తదేవ మే రూపమిదం ప్రపశ్య ॥ **(11-49)**

ఇట్టి నా భయంకర రపము చూచి నీకు బాధ భ్రాంతి కలుగకుండుగాక. భయమును వీడి ప్రీతితో కూడిన మనస్సుతో నీవు కోరిన నా రూపమును చూడుము.

నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా ।
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా ॥ **(11-53)**

నీవు చూచిన నా (విశ్వ) రూపము చూచుటకు వేదముల చేతగానీ, తపస్సుచేతగానీ, దానముచేతగానీ, పూజల చేతగానీ సాధ్యము కాదు.

భక్త్యా త్వనన్యయా శక్యః అహమేవంవిధోర్జున ।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప॥ **(11-54)**

వేరే విధములుగా కాక కేవలము భక్తి చేతనే ఈ విధముగా తెలియుటకు, చూచుటకు, యదార్థముగా ప్రవేశించుటకు సాధ్యమగును.

మత్కర్మకృత్ మత్పరమో మద్భక్తః సంగవర్జితః ।
నిర్వైరః సర్వభూతేషు యస్స మామేతి పాండవ ॥ **(11-55)**

కల్మషము, కల్పనలు, కోరికలు లేనివాడు నేనే పరమగతిగా భావించి నాకై పనులు చేయుచూ ఏ జీవియందును శతృత్వము లేనివాడు నన్ను చేరును.

జ్యోతిషామపి తజ్జ్యోతిః తమసః పరముచ్యతే ।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్ ॥ **(13-17)**

ప్రకాశవంతమైనవానిలో కూడా ఆ ప్రకాశము అజ్ఞానాంధకారమునకు అతీతమని చెప్పబడుచున్నది. జ్ఞానము, తెలియదగినది, జ్ఞానముచే చేరగలిగినది (ఆత్మ) అందరి హృదయమునందు ఉన్నది.

## 8.3 సమత్వ బుద్ధి యోగము :

త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున ।
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥ **(2-45)**

వేదములు త్రిగుణములకు సంబంధించిన విషయములను గూర్చి తెలుపును. నీవు త్రిగుణాతీతుడవగుము. ద్వంద్వములకతీతుడవగుము.యోగక్షేమముల గురించిన ఆలోచనలు, చేష్టలు లేనివాడవగుము. నిత్య సత్యుడైన పరమాత్మయందే స్థితుడవగు ఆత్మ కలిగియుండుము.

యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే ।
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః ॥ **(2-46)**

పెద్దజలాశయము అందుబాటులోనున్న వానికి చిన్న జలాశయము వలన ఎంత ప్రయోజనమో అట్లే బ్రహ్మ జ్ఞానికి వేదముల వలన అంతే ప్రయోజనము.

కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన ।
మా కర్మఫలహేతుర్భూః మ తే సంగోస్త్వకర్మణి ॥ **(2-47)**

నీకు కర్మలయందు మాత్రము అధికారము కలదు. వాటి ఫలములయందు లేదు. కర్మ ఫలములకు కారణము కావలదు. కర్మలు మానుటయందు ఆసక్తుడవు కావలదు.

యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ ।
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే ॥ **(2-48)**

సమత్వ భావమే యోగమని చెప్పబడుచున్నది. సిద్ధి-అసిద్ధుల యెడ సమభావముకలిగినవాడవై చేసే పనితో సంగత్వము (ఆసక్తి) వదలి నీ కర్తవ్య కర్మలను సమత్వ భావముతో చేయుము.

దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ ।
బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః ॥ **(2-49)**

ఫలితము కొరకు పనిచేయువారు పరుల కృప కొరకు ఆరాటపడుదురు. పరమాత్మునియందు బుద్ధి నుంచి హీనకర్మలకు దూరమై పరమాత్ముని శరణము కొరకు ప్రయత్నింపుము.

బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే ।

తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్ ॥ **(2–50)**

సమత్వ బుద్ధితో పనులు చేయుట కుశలమైనది. అట్టి బుద్ధితో మంచి చెడు పనుల ఫలితములను (పాప పుణ్యములను) ఇక్కడే వదలవచ్చును. అట్టి యోగమునందు నియుత్తుడవగుము.

కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః ।

జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛంత్యనామయమ్ ॥ **(2–51)**

సమబుద్ధి కలగిన జ్ఞానులు కర్మఫలమును వదలి జన్మ బంధములనుండి ముక్తులై నిర్వికార పరమపధమును పొందుదురు.

యదా  తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి ।

తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥ **(2–52)**

ఎప్పుడు నీ బుద్ధి అరణ్యమువంటి మోహమునతిక్రమించునో అప్పుడు నీవు వినినదానియెడ వినవలసిన దానియెడ విరక్తి పొందెదవు.

శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా ।

సమాధావచలా బుద్ధిః తదా యోగమవాప్స్యసి ॥ **(2–53)**

వినినదాని వలన ప్రభావితము కాక ఎప్పుడు చలించని నీ బుద్ధి యోగ సమాధిలో నిశ్చలముగా ఉండునో అప్పుడు పరమాత్మతో సంయోగమేర్పడును.

చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః ।

బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తః సతతం భవ ॥ **(18–57)**

సర్వ కర్మలను నాకర్పించి నా రక్షణయందు సమత్వ బుద్ధి యోగమునాశ్రయించి ఎల్లప్పుడును మనస్సును నాయందే నిలుపుము.

మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసాదాత్ తరిష్యసి ।

అథ చేత్ త్వమహంకారాత్ న శ్రోష్యసి వినంక్ష్యసి ॥ **(18–58)**

నాయందే మనస్సుగలవాడవై అన్ని ఆటంకములను నా అనుగ్రహమున అతిక్రమించగలవు. కాని ఒకవేళ అహంకారము వలన (నా మాట) విననిచో నశింతువు.

### 8.3.1 సమత్వ బుద్ధి :

మాత్రా స్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణ సుఖదు:ఖదాః ।

ఆగమాపాయినోనిత్యాః తాంస్తితిక్షస్వ భారత ॥ **(2–14)**

స్పర్శ మొదలగు ఇంద్రియానుభవములు, చలి, వేడి మొదలగు సుఖదు:ఖములను ఇచ్చునట్టివి. అవి వస్తూ పోతూ ఉంటాయి. తాత్కాలికములు. వాటిని సహింపుము.

యం హి న వ్యథయంత్యేతే పురుషం పురుషర్షభ ।

సమదుఃఖసుఖం ధీరం సోమృతత్వాయ కల్పతే ॥ **(2–15)**

ఇవన్నియు ఎవనిని బాధింపవో, సుఖదు:ఖములను సమముగా జూచు అట్టి ధీరుదు మోక్షమునకు అర్హుడు.

సుఖదు:ఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ ।

తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి ॥ **(2–38)**

సుఖదు:ఖములను, లాభనష్టాలను, జయాపజయాలను సమానంగా తలచి (జీవన) పోరాటమున నియుక్తుడవయిన యెడల పాపమును పొందవు.

విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।

శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః ॥ **(5–18)**

పండితుడు విద్య, వినయ సంపదలు కల్గిన బ్రాహ్మణుని, గోవును, ఏనుగును, కుక్కను, కుక్క మాంసము తినువానిని సమదృష్టితో చూచును.

ఇహైవ తైర్జితః సర్గో యేషాం సామ్యే స్థితం మనః ।

నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్ బ్రహ్మణి తే స్థితాః ॥ **(5–19)**

ఎవరి మనస్సు దోషరహితమై సమభావముతోనుండునో వారు ఈ జన్మయందే జనన మరణములను జయించిన వారగుదురు. వారు బ్రహ్మ సమానులు. కనుక బ్రహ్మమునందు స్థితులగుదురు.

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోర్జున ।

సుఖం వా యది వా దు:ఖం స యోగీ పరమో మతః ॥ **(6–32)**

సర్వవ్యాప్తమైన పరమాత్మతో ఏకీభావ స్థితిని పొందిన ఆత్మగలవాడు అన్నిటిని, సుఖమైనను, దు:ఖమైనను, తనతో సమానముగా చూచును. అతడు ఉత్తమ యోగిగా పరిగణింపబడును.

న ప్రహృష్యేత్ ప్రియం ప్రాప్య నోద్విజేత్ ప్రాప్య చాప్రియమ్ ।

స్థిరబుద్ధిరసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః ॥ **(5–20)**

ఇష్టమైన దానిని పొంది ఉప్పొంగిపోక ఇష్టములేని దానిని పొంది కలతనొందక స్థిరమైన బుద్ధిగలిగినవాడును, మోహమునొందనివాడును పరమాత్ముని ఎరిగినవాడును పరమాత్ముని యందు స్థితుడై ఉండును.

బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖమ్ ।

న బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే ॥ **(5–21)**

బాహ్య విషయములందు ఆసక్తిలేనివాడు ఆత్మయందే సుఖముననుభవించుచూ ధ్యానమునందు తరగని సుఖముననుభవించును.

### 8.3.2 కర్తవ్య కర్మ :

తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ ।

మయ్యర్పితమనోబుద్ధిర్మామేవైష్యస్యసంశయః ॥ **(8–7)**

అన్ని కాలములయందును నన్ను స్మరింపుము. యుద్ధము కూడా చేయుము. నాయందు సమర్పింపబడిన మనోబుద్ధుల వలన నిస్సందేహముగా నన్నే పొందగలవు.

కాయేన మనసా బుద్ధ్యా కేవలైరింద్రియైరపి ।

యోగినః కర్మకుర్వన్తి సంగం త్యక్త్వాత్మశుద్ధయే ॥ **(5–11)**

యోగులు సంగత్వము లేకుండా ఆత్మశుద్ధి కొరకు కేవలం మనసు, బుద్ధి, ఇంద్రియములు, శరీరముతో పనులు చేస్తారు.

### 8.3.3 యోగి :

తపస్విభ్యోధికో యోగీ జ్ఞానిభ్యోపి మతోధికః ।

కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున ॥ **(6–46)**

కర్మాచరణ చేయువానికన్ననూ, జ్ఞానికన్ననూ, తపస్యులకన్నను యోగి అధికుడు. అందచే యోగివి అగుము.

యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా ।

శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః ॥ **(6-47)**

యోగులందరిలో కూడా అంతఃకరణములో అన్ని విధాలుగా నా మార్గమునే అనుసరించుచు ఎవరు శ్రద్ధతో నన్ను భజిస్తారో వారు నాచే ఉత్తమ యోగిగా భావింపబడుదురు.

అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః ।

తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః ॥ **(8-14)**

ఇతర భావనలు లేకుండా నిత్యము ఎల్లప్పుడు ఎవడు నన్ను స్మరించునో అతనికి నేను సులభముగా లభింతును.

నైతీ సృతీ పార్థ జానన్యోగీ ముహ్యతి కశ్చన ।

తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున ॥ **(8-27)**

శుక్ల కృష్ణ మార్గములను తెలిసికొనిన యోగి ఎవ్వడును మోహమునొందదు. అందుచే ఎల్లప్పుడును యోగయుక్తుడవగుము.

వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్ ।

అత్యేతి తత్సర్వమిదం విదిత్వా యోగీ పరం స్థానముపైతి చాద్యమ్ ॥ **(8-28)**

వేదాధ్యయనము, యజ్ఞ తపోదానాదులకు నిర్దేశింపబడిన పుణ్య ఫలముల అన్నింటినీ మించినదిగా తెలుసుకొని యోగి అన్నిటికీ మూలమైన పరమస్థానమును పొందును.

యోన్తః సుఖోన్తరారామస్తథాన్తర్జ్యోతిరేవ యః ।

స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోధిగచ్ఛతి ॥ **(5-24)**

ఎవడు అంతరంగమునందే సుఖమును, విశ్రాంతిని, దివ్య లక్ష్యము కలిగియుండునో అతడు యోగి. ఆత్మానుభవమును పొంది బ్రహ్మ నిర్వాణము చెందును.

లభంతే బ్రహ్మనిర్వాణమ్ ఋషయః క్షీణకల్మషాః ।

ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితే రతాః ॥ **(5-25)**

ఋషులు, పాపరహితులు, ద్వైత భావము నశించినవారు ఆత్మానుభవమున అనురక్తులు సకల జీవుల మేలుకొరకు పాటుపడువారు బ్రహ్మ నిర్వాణమును పొందుదురు.

కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్ ।

అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్ ॥ **(5-26)**

కామక్రోధములనుండి విముక్తులై మనోనిగ్రహము కలిగిన యతులు త్వరలోనే ఆత్మ జ్ఞానమునొంది బ్రహ్మ నిర్వాణమును పొందుదురు.

### 8.3.4 నిష్ఠ :

లోకేశ్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ ।

జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్ ॥ **(3-3)**

పూర్వము నాచే రెండు విధములైన నిష్ఠలు చెప్పబడినవి. సాంఖ్య (ప్రకృతి ధర్మములననుసరించి విశ్లేషించు) యోగులకు జ్ఞానయోగము ద్వారా, యోగులకు (సమత్వ బుద్ధిగల యోగులకు) కర్మయోగము ద్వారా నిష్ఠ కలుగును.

## 8.4 నైష్కర్మ్య సిద్ధి :

అసక్త బుద్ధిః సర్వత్ర జితాత్మా విగతస్పృహః ।

నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి ॥ **(18-49)**

దేనియందును ఆసక్తి లేనివాడై మనస్సును ఇంద్రియములనుజయించినవాడై భౌతిక ప్రపంచ స్పృహ లేనివాడై (అంతర్ముఖుడై) ఉత్కృష్టమైన నైష్కర్మ్యసిద్ధిని సన్యాసము ద్వారా పొందును.

సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాప్నోతి నిబోధ మే ।

సమాసేనైవ కౌంతేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా ॥ **(18-50)**

సిద్ధిని పొందినవాడై జ్ఞానము యొక్క పరాకాష్ఠ అయిన బ్రహ్మ స్థితిని ఏవిధంగా పొందునో నానుండి సంగ్రహముగా తెలుసుకొనుము.

బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్య చ ।

శబ్దాదీన్ విషయాన్ త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ ॥ **(18-51)**

వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః ।

ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥ **(18-52)**

అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్ ।

విముచ్య నిర్మమః శాంతో బ్రహ్మభూయాయ కల్పతే ॥ **(18-53)**

పరిపూర్ణముగా పవిత్రమైన బుద్ధిని కలిగి దృఢనిశ్చయముతో ఆత్మను (వాసనలను) నిగ్రహించి శబ్దము మొదలైన ఇంద్రియార్థములను విడిచి రాగద్వేషాల్ని త్యజించి, ఏకాంత ప్రదేశమున మితాహారియై వాక్కు, శరీరము, మనసులను నిగ్రహించి ప్రపంచ విషయములయందు వైరాగ్యమునొంది నిత్యము ధ్యానయోగస్థితుడై అహంకారము, బలము, దర్పము, కామము, క్రోధము, వస్తు సేకరణలనువదలి దేనియందును మమకారము లేనవాడై శాంతినొందినవాడు బ్రహ్మస్థితుడగుటకు అర్హుడు.

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి ।

సమః సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్ ॥ **(18-54)**

ప్రసన్నమైన ఆత్మను కలిగి బ్రహ్మ స్వరూపుడైనందున విచారింపడు, దేనిని కోరడు. అన్నిటియందును సమభావము కలిగియుండును. అట్టివాడు ఉత్కృష్టమైన నా భక్తిని పొందును.

భక్త్యా మామభిజానాతి యావాన్యశ్చాస్మి తత్త్వతః ।

తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్ ॥ **(18-55)**

భక్తితో సాధ్యమైనంత యథారూపముగా నా తత్త్వమును తెలుసుకొనును. నా తత్త్వమును తెలుసుకొనిన పిమ్మట నన్ను ప్రవేశించును.

### 8.4.1 కర్మ సన్న్యాసం :

న కర్మణామనారమ్భాత్ నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।

న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధి గచ్ఛతి ॥ **(3-4)**

మనిషి పనులు చేయకుండుట వలన నైష్కర్మ్యమును (కర్మ ఫలమునుండి విముక్తి) పొందడు. అలాగే సన్యసించిన మాత్రముచే ఆత్మసాక్షాత్కారమును పొందడు.

సన్న్యాసస్తు మహాబాహో దు:ఖమాప్తుమయోగతః ।

యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధి గచ్ఛతి ॥ **(5–6)**

అయోగ్యుడు సన్యాసాశ్రమమున దు:ఖమును పొందును. యోగ్యుడైన ముని పరమాత్మను శీఘ్రముగా పొందును.

సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ ।

నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్న కారయన్ ॥ **(5–13)**

నవ ద్వారములు గల పురమనే దేహమునందున్న జీవి ఏ పనులు చేయకుండా చేయించకుండా అన్ని పనులను మానసికముగా త్యజించి సుఖముగా ఉండును.

అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః ।

స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్న చాక్రియః ॥ **(6–1)**

కర్మ ఫలమునాశ్రయింపక చేయవలసిన పనులను చేయువాడు సన్యాసి మరయు యోగి కూడా. అగ్ని కార్యములను, విద్యుక్త ధర్మమును చేయనివాడు సన్యాసిగానీ యోగి కానీ కాడు.

యం సన్న్యాసమితి ప్రాహుర్యోగం తం విద్ధి పాండవ ।

న హ్యసన్న్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన ॥ **(6–2)**

దేనిని సన్న్యాసమని చెప్పుదురో దానిని యోగమని తెలుసుకొనుము. సంకల్పమును విడువకుండా ఎవడును యోగి కాజాలడు.

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।

యత్తపస్యసి కౌంతేయ తత్ కురుష్వ మదర్పణమ్ ॥ **(9–27)**

నీవు ఏది చేసినను, ఏది భుజించినను, ఏది హోమము చేసినను, ఏది దానమిచ్చినను, ఏ తపస్సు చేసినను దానిని నాకు అర్పించుము.

శుభాశుభఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః ।

సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి ॥ **(9–28)**

ఆవిధంగా శుభాశుభ ఫలములనుండియు కర్మబంధముల నుండియు ముక్తుడవగుదువు. సన్యాస యోగమునందు మనస్సును స్థిరముగా నిలిపి ముక్తినొంది నన్ను పొందెదవు.

కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః ।

సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః ॥ **(18–2)**

కోరికలను, కర్మలను వదులుట సన్యాసమని విజ్ఞులు ఎరుగుదురు. సర్వకర్మఫలత్యాగమును త్యాగమని అనుభవజ్ఞులు తెలుపుదురు.

త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః ।

యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యమితి చాపరే ॥ **(18–3)**

పనులన్నీ దోషముతో కూడి ఉండును కనుక విడువవలెనని ఒక వర్గము వారనగా యజ్ఞదానతపస్సులను విడువరాదని ఇతరులు పలుకుదురు.

నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ ।

త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధః సంప్రకీర్తితః ॥ **(18–4)**

త్యాగము మూడు విధములని చెప్పబడినది. త్యాగము గురించి నా నిర్ణయము వినుము.

యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ ।
యజ్ఞోదానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥ **(18-5)**

యజ్ఞ దాన తపస్సులు మహాత్ములను కూడా పవిత్రము చేయును. వానిని వదలరాదు. తప్పక చేయవలెను.

ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ ।
కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమమ్ ॥ **(18-6)**

కర్మలన్నిటినీ ఎట్టి సంగత్వము, ఫలాపేక్ష లేకుండా స్వధర్మముగా చేయవలెనని నా నిశ్చితాభిప్రాయము.

నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే ।
మోహాత్ తస్య పరిత్యాగః తామసః పరికీర్తితః ॥ **(18-7)**

నియమిత (కర్తవ్య) కర్మలను విడువరాదు. మోహ కారణమున వానిని విడిచినచో దానిని తామస త్యాగమందురు.

దు:ఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్ త్యజేత్ ।
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ ॥ **(18-8)**

ఏ పనికైనా దు:ఖకరమని శరీరమునకు కష్టమగునని భయము వలన చేయకుండా వదలినచో అది రాజస త్యాగమనబడును. అట్టి త్యాగము వలన ఫలితముండదు.

కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేర్జున ।
సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగః సాత్త్వికో మతః ॥ **(18-9)**

నియమిత (కర్తవ్య) కార్యమును చేసి ఆ పనితో సంగత్వము, ఫలితము కూడా వదలుట సాత్త్విక త్యాగమనబడును.

న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్యతే ।
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః ॥ **(18-10)**

అశుభ కర్మలను ద్వేషింపక మేలు చేసెడి పనులయందు ఆసక్తి కలిగియుండని త్యాగమయుడు సత్త్వ గుణ సంపన్నుడైన మేధావి. ధర్మ సందేహములన్నియు తొలగినవాడు.

న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః ।
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే ॥ **(18-11)**

పనులన్నిటినీ విడుచుట ఏ ప్రాణి వలనను సాధ్యము కాదు. పనుల ఫలితమును వదలినవాడు నిజమైన త్యాగి అనబడును.

అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్ ।
భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్ ॥ **(18-12)**

కర్మ ఫలమును త్యజించని వాని పనులకు ఇష్టమైనవి ఇష్టము కానివి, మిశ్రమమైనవి అని మూడు విధములైన ఫలితములు మరణానంతరం మిగిలి ఉండును (వాటిని అనుభవించవలసియుండును). సన్యాసికి అటుల ఉండదు.

### 8.5 త్రిగుణాతీతుడు :

గుణానేతానతీత్యా త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।
జన్మమృత్యుజరాదు:ఖైవిముక్తోమృతమశ్నుతే ॥ **(14-20)**

శరీరమును ధరించిన జీవి శరీరము నుండి పుట్టిన మూడు గుణములను అతిక్రమించి పుట్టుట, మరణించుట, ముసలితనముల వలన కలిగెడి దు:ఖముల నుండి ముక్తుడై అమృతత్వమును పొందును.

కైర్లింగైః త్రీన్ గుణానేతాన్ అతీతో భవతి ప్రభో ।

కిమాచారః కథం చైతాన్ త్రీన్ గుణానతివర్తతే ॥ **(14-21)**

మూడు గుణములను అతిక్రమించినవాని లక్షణములేమిటి? అతని ప్రవర్తన ఏవిధంగా ఉండును? మూడు గుణములను అతిక్రమించుట ఎట్లు? అనగా ....

ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ ।

న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి ॥ **(14-22)**

సత్త్వ గుణము వలన కలిగెడి వివేకము, రజోగుణము వలన కలిగెడి ఆసక్తి, తమో గుణము వలన కలిగెడి మోహము కలిగినపుడు వాటిని ద్వేషింపక అవి లేనపుడు వాటియందు కోరిక లేకుండా ఉండును.

ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే ।

గుణా వర్తంత ఇత్యేవ యోవతిష్ఠతి నేంగతే ॥ **(14-23)**

గుణములచే కలతనొందింపబడక తటస్థముగా ఉంటూ గుణములు పనిచేయుచున్నవని తెలిసికొని చలింపకుండును.

సమదు:ఖసుఖః స్వస్థః సమలోష్టాశ్మకాంచనః ।

తుల్యప్రియాప్రియో ధీరః తుల్యనిందాత్మసంస్తుతిః ॥ **(14-24)**

సుఖదుఖములను సమముగా భావించి అంతర్ముఖుడై మట్టిని, రాయిని, బంగారమును సమముగా భావించును. ప్రియమైన వాటిని అప్రియమైన వాటిని సమముగా భావించును. తనకు లభించు నిందలు, పొగడ్తలకు చలించడు.

మానవమానయోస్తుల్యః తుల్యో మిత్రారిపక్షయోః ।

సర్వారంభపరిత్యాగీ గుణాతీతః స ఉచ్యతే ॥ **(14-25)**

గౌరవము, అవమానములను సమముగా భావించును. మిత్రులను, శత్రువులను సమముగా భావించును. ఏ పనినీ మొదలుపెట్టడు. పై లక్షణములు కలవాడు త్రిగుణాతీతుడనబడును.

మాం చ యోవ్యభిచారేణ భక్తియోగేన సేవతే ।

స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే ॥ **(14-26)**

నాయందు అచంచల భక్తితో ఎవడు సేవ చేయునో అతడు త్రిగుణాతీతుడై పరమాత్మకు చేరువగును.

బ్రహ్మణో హి ప్రతిష్ఠాహమ్ అమృతస్యావ్యయస్యచ ।

శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాంతికస్య చ ॥ **(14-27)**

మరణము లేనిది, క్షీణింపనిది, శాశ్వతమైనది, ధర్మానికి, సుఖానికి మూలము, బ్రహ్మకు మూలాధారము కూడా పరమాత్మే.

## 8.6 ధ్యాన యోగం :

ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్ ।

ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే ॥ **(2-55)**

మనసు నందు కల్పితములైన కోరికలన్నిటినీ వదలి అంతర్ముఖుడై తన ఆత్మయందే స్థితుడై తృప్తినొందినపుడు స్థితప్రజ్ఞుడని చెప్పబడును.

దుంఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః ।

వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే ॥ **(2-56)**

దు:ఖమును కలిగించు సంఘటనలయందు కలత చెందని మనసుకలవాడై సుఖమును కలిగించు పరిస్థితులయందు సుఖమును మనసుతో అనుభవింపక అనురాగము, భయము, కోపము లేనివాడు స్థిరమైన మనసుగల ముని అని చెప్పబడును.

యః సర్వత్రానభిస్నేహః తత్తత్ప్రాప్య శుభాశుభమ్ ।

నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ **(2-57)**

ప్రపంచంలో అనురాగము పొందక దానివలన పొందు మంచి చెడులను ప్రశంసింపక లేక ద్వేషింపక ఉండువాడు స్థితప్రజ్ఞుడు.

ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణముచ్చతే ।

యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే ॥ **(6-3)**

యోగమునందు మునికి ఆరంభములో కర్మ యోగమే సాధనము. యోగారూఢునికి ఇంద్రియ నిగ్రహము సాధనము అని చెప్పబడినది.

యదా హి నేంద్రియార్థేషు న కర్మస్వనుజ్జతే ।

సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢస్తదోచ్యతే ॥ **(6-4)**

పనులు చేయవలెనను సంకల్పములన్నింటినీ వదిలిన సన్యాసి తన ఇంద్రియ తృప్తి కొరకు చేయు పనులయందు నిమగ్నమగుట ఎప్పుడు మానునో అప్పుడు యోగారూఢుడనబడును.

(యోగ శాస్త్రమునందు 1) యమం, 2) నియమం, 3) సుఖాసనం, 4) ప్రాణాయామం, 5) ప్రత్యాహారం, (6) ధారణ, 7) ధ్యానం, 8) సమాధి అను అష్టాంగ యోగము తెలుపబడినది.

యమం : అహింస, సత్యము, అస్తేయము (శాస్త్ర విరుద్ధముగా ద్రవ్యము తీసుకొనకుండుట), బ్రహ్మచర్యము, అపరిగ్రహము (దేనినీ తీసుకొనకుండుట).

నియమం : శౌచము, సంతోషము, తపము

ప్రత్యాహారం : చిత్తమును నిరోధించుట వలన ఇంద్రియములను నిరోధించుట

ధారణ : చిత్తమును శరీరమునందలి ఒక ప్రదేశమున నిశ్చలముగా ఉంచుట.)

స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాన్ చక్షుశ్చైవాంతరే భ్రువోః ।

ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యంతరచారిణౌ ॥ **(5-27)**

యతేంద్రియమనోబుద్ధిః మునిర్మోక్షపరాయణః ।

విగతేచ్ఛాభయక్రోధో యః సదా ముక్త ఏవ సః ॥ **(5-28)**

బయటనుండెడి స్పర్శ, శబ్దము మొదలగు ఇంద్రియార్థములను త్యజించి దృష్టిని కనుబొమల నడుమ నిలిపి ఉచ్ఛ్వాస నిశ్వాసలను నాశికయందు సమముగా నడుపుతూ దానివలన మనసు, బుద్ధి, ఇంద్రియములను అదుపుచేసి మోక్షము కోరిన వాడు ఇతర కోరికలు, భయము, కోపములనుండి ముక్తుడగును. ఎల్లప్పుడును ఆ విధముగా నుండువాడు ముక్తుడగును.

యదా సంహరతే చాయం కూర్మోంగానీవ సర్వశః ।

ఇంద్రియాణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ **(2-58)**

తాబేలు ముడుచుకొను విధముగా ఇంద్రియములను ఇంద్రియార్థముల నుండి ఉపసంహరించుకొనువాని బుద్ధి స్థిరముగా నుండును.

విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః ।

రసవర్జం రసోప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ॥ **(2-59)**

ఇంద్రియములను విషయముల (ఇంద్రియార్థముల) నుండి మరల్చిననూ అత్యుత్తమానుభవము ద్వారా మనసు విషయములనుండి మరలును.

యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః ।

ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః ॥ **(2-60)**

ఇంద్రియములను అదుపు చేయవలెనని ప్రయత్నించిన మనిషి ఎంతటి జ్ఞానవంతుడైనను కలతనొందించు ఇంద్రియములు అతని మనసును హరించుచున్నవి (తనవైపు ఆకర్షించును).

తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।

వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ **(2-61)**

ఇంద్రియములన్నింటినీ నిగ్రహించి నా ధ్యానమునందుండవలెను. ఇంద్రియములను వశమునందుంచుకొను వాని బుద్ధి స్థిరముగా నుండును.

రాగద్వేషవియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్ ।

ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి ॥ **(2-64)**

పరమాత్మునికి విధేయుడై అంతఃకరణమును (అహం, బుద్ధి, మనసు) వశమునందుంచుకొని ఇష్టాయిష్టాలు లేనివాడై ఇంద్రియములతో విషయములను అనుభవించుచున్ననూ పరమాత్ముని అనుగ్రహమునుపొందును.

ప్రసాదే సర్వదు:ఖానాం హానిరస్యోపజాయతే ।

ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే ॥ **(2-65)**

పరమాత్ముని అనుగ్రహము వలన దు:ఖములన్నియు నశించిపోవును. అట్లు ప్రసన్నతనొందిన చిత్తము కలిగినవాని బుద్ధి శీఘ్రముగా సుస్థిరమగును.

నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా ।

న చాభావయతః శాంతిః అశాంతస్య కుతః సుఖమ్ ॥ **(2-66)**

మనసు, ఇంద్రియములు వశమునందుండనివానికి నిశ్చయాత్మక బుద్ధి, ఆస్తిక (భగవంతుని) భావము ఉండదు. ఆస్తిక భావము లేనివానికి శాంతి ఉండదు. శాంతి లేని వానికి సుఖమెక్కడుండును?

ఇంద్రియాణాం హి చరతాం యన్మనోను విధీయతే ।

తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి ॥ **(2-67)**

ఇంద్రియములలో మనసు ఏ ఇంద్రియముననుసరించి విషయములను గ్రహించునో ఆ ఇంద్రియము, నీటిలో నావను గాలి నెట్టివేయు విధముగా అతని బుద్ధిని క్షీణింపజేయును.

తస్మాద్యస్య మహాబాహో! నిగృహీతాని సర్వశః ।

ఇంద్రియాణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ **(2-68)**

అందుచే ఎవని ఇంద్రియములన్నియు ఇంద్రియార్థముల (విషయముల) నుండి నిగ్రహింపబడియుండునో అతని బుద్ధి స్థిరముగా ఉండును.

యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ ।

యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥ **(2-69)**

ఎప్పుడు అన్ని జీవులకు రాత్రియో అప్పుడు ఆత్మ నిగ్రహముగలవాడు ధ్యానమునందు మేల్కొనియుండును. ఎప్పుడు జీవులన్నీ మేల్కొనియుండునో అప్పుడు మునికి రాత్రితో సమానము.

ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్ ।

ఆత్మైవ హ్యాత్మనో బంధుః ఆత్మైవ రిపురాత్మనః ॥ **(6-5)**

మనిషికి మనసు మిత్రుడు, శత్రువు కూడా అయివున్నది. మనసుచేత తనను తాను ఉద్ధరించుకొనవలెను. అధోగతిపాలు కారాదు.

ఆపూర్యమాణమచలప్రతిష్ఠం సముద్రమాపః ప్రవిశంతి యద్వత్ ।

తద్వత్ కామా యం ప్రవిశంతి సర్వే స శాంతిమాప్నోతి న కామకామీ ॥ **(2-70)**

ఎల్లప్పుడూ నదీ జలములు కలిసినను స్థిరముగానుండు సముద్రము వలె కోరికలు ప్రవేశించుచున్నను నిశ్చలముగానుండువాడు శాంతిని పొందును. కోరికలను తీర్చుకొనువాడు శాంతిని పొందజాలడు.

విహాయ కామాన్ యః సర్వాన్ పుమాంశ్చరతి నిఃస్పృహః

నిర్మమో నిరహంకారః స శాంతిమధిగచ్ఛతి ॥ **(2-71)**

కోరికలనన్నిటినీ వదిలి అహంకారము, నేను, నాది అనునవి లేనివాడై ఎవరు జీవించునో అతడు శాంతిని పొందును.

ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి ।

స్థిత్వాస్యామంతకాలేపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి ॥ **(2-72)**

ఇదే బ్రాహ్మీ స్థితి. దీనిని పొంది కలతనొందడు. జీవితాంతమున ఈ స్థితియందుండి బ్రహ్మ నిర్వాణమును (ముక్తిని) పొందును.

బంధురాత్మాత్మనస్తస్య యేవాత్మైనా జితః ।

అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్ ॥ **(6-6)**

మనస్సును జయించిన వానికి మనస్సు మిత్రుని వలె సహకరించును. మనస్సును జయింపలేనివానికి మనస్సు శత్రువువలె అవరోధములు కల్పించును.

జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః ।

శీతోష్ణసుఖదు:ఖేషు తథా మానావమానయోః ॥ **(6-7)**

మనస్సును జయించినవాడు పరమాత్మను పొంది చలి, వేడి, సుఖదుఖాలు, అలాగే గౌరవము, అవమానములయందు కూడా ప్రశాంతముగా ఉండును.

జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః ।

యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః ॥ **(6-8)**

జ్ఞాన విజ్ఞానములతో తృప్తినొంది ధ్యాన యోగమున ఇంద్రియములను జయించినవాడు ఆత్మ సాక్షాత్కారమునకు అర్హుడని చెప్పబడెను. అట్టి యోగి మట్టిని, రాయిని, బంగారమును సమానముగా భావించును.

సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థద్వేష్యబంధుషు ।

సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే ॥ **(6-9)**

సహృదయులు, మిత్రులు, ఉదాసీనులు, మధ్యస్థముగానుండువారు, ద్వేషించువారు, బంధువులు, సాధువులు, పాపులయెడ సమబుద్ధి గల యోగి గొప్ప యోగి.

సంకల్పప్రభవాన్ కామాన్ త్యక్త్వా సర్వానశేషతః ।

మనసైవేంద్రియగ్రామం వినియమ్య సమంతతః ॥ **(6-24)**

సంకల్పము వలన పుట్టిన కోరికలన్నింటినీ పూర్తిగా వదలి మనస్సు చేత ఇంద్రియములన్నింటినీ అన్ని విధములుగా నిగ్రహించి, నియమ భంగములేని మనస్సుతో దృఢ నిశ్చయముతో యోగాభ్యాసము చేయవలెను.

అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్ ।

అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే ॥ **(6-35)**

నిస్సందేహముగా మనస్సు నిగ్రహింప శక్యము కానిది. చంచలమైనది. కాని అభ్యాస వైరాగ్యములతో నిగ్రహింపవచ్చును.

అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।

వశ్యాత్మనా తు యతతా శక్యోవాప్తుముపాయతః ॥ **(6-36)**

మనో నిగ్రహము లేని వానికి ఆత్మానుభవము పొంద శక్యము కానిది. కాని మనో నిగ్రహము గలవాడు సరైన మార్గములో ప్రయత్నించి ఆత్మానుభవమును పొందగలడు.

యోగీ యుంజీత సతతమ్ ఆత్మానం రహసి స్థితః ।

ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః ॥ **(6-10)**

యోగి దేనినీ ఆశింపక దేనినీ తీసుకొనక ఏకాంత ప్రదేశమున ఒంటరిగా ఎల్లప్పుడూ మనోనిగ్రహముతో ఎల్లప్పుడు పరమాత్ముని యందు భక్తితో ఉండవలెను.

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః ।

నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజినకుశోత్తరమ్ ॥ **(6-11)**

శుచిగా ఉండే ప్రదేశమున అతి ఎత్తుగాను లేక అతి క్రిందుగాను కాకుండా (సరయిన ఎత్తులో) దర్భలు వానిపై జింక చర్మము, దానిపై మృదువైన వస్త్రము కప్పిన తన ఆసనముంచి ...

తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః ।

ఉపవిశ్యాసనే యుంజ్యాత్ యోగమాత్మవిశుద్ధయే ॥ **(6-12)**

దాని మీద సుఖమైన ఆసనమున కూర్చుని చిత్తమును, ఇంద్రియములను, పనులను నియంత్రించి ఆత్మశుద్ధికొరకు ఏకాగ్రమైన మనస్సుతో యోగాభ్యాసము చేయవలెను.

సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః ।

సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్ ॥ **(6-13)**

శరీరమును, తలను, మెడను సమముగా నిలుపుచూ కదలకుండా స్థిరముగా తన ముక్కు కొనను చూస్తూ దిక్కులు చూడకుండా ఉండవలెను.

ప్రశాంతాత్మా విగతభీః బ్రహ్మచారివ్రతే స్థితః ।

మనః సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః ॥ **(6-14)**

ప్రశాంతమైన అంతఃకరణ కలిగి, భయము లేనివాడై బ్రహ్మచర్య వ్రతమును ఆచరిస్తూ, మనసును నిగ్రహించి తాను చాలా కాలము సుఖముగా కదలకుండా ఉండగలిగే యోగాసనమున నేనే లక్ష్యముగా నాయందు చిత్తమునుంచవలెను.

యతో యతో నిశ్చరతి మనశ్చంచలమస్థిరమ్ ।

తతస్తతో నియమ్యైతత్ ఆత్మన్యేవ వశం నయేత్ ॥ **(6-26)**

స్థిరముకాని చంచలమైన మనస్సు చలించినప్పుడల్లా దానిని నిగ్రహించి ఆత్మయందే వశము చేయవలెను.

శనైః శనైరుపరమేత్ బుద్ధ్యా ధృతిగృహీతయా ।

ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్ ॥ **(6-25)**

క్రమముగా నిశ్చయాత్మక బుద్ధితో మనస్సును ఆత్మయందు నిలిపి ఇతరమైన దేనిని తలంచక ధ్యానమునందుండవలెను.

యుంజన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః ।

శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి ॥ **(6-15)**

యోగి ఎల్లప్పుడును పైన తెలిపిన విధంగా యోగాభ్యాసము చేసి, మనస్సును నియంత్రించి, భౌతిక దేహమును వదలిన పిదప పరంధామమును పొందును.

నాత్యశ్నతస్తు యోగోస్తి న చైకాంతమనశ్నతః ।

న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున ॥ **(6-16)**

అతిగా భుజించువానికి, అతిగా నిద్రించువానికి, సరిగా తిననివానికి, సరిగా నిద్రించనివానికి ఈ యోగము ఫలించదు.

యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు ।

యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దు:ఖహా ॥ **(6-17)**

యోగము ఫలించుటకవసరమైన ఆహారము, విహారము (నడుచుట), చేష్టలు, పనులు, నిద్ర, మేల్కొనియుండుట, చేయుచు అభ్యాసము చేసినయెడల దు:ఖనాశకమగు ధ్యాన యోగము సిద్ధించును.

యదా వినియతం చిత్తమ్ ఆత్మన్యేవావతిష్ఠతే ।

నిఃస్పృహః సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా ॥ **(6-18)**

ఏ కోరికలు లేకుండా చిత్తమును ఆత్మయందు నియంత్రించి ఉన్నప్పుడు యోగయుక్తుడనబడును.

యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా ।

యోగినో యతచిత్తస్య యుంజతో యోగమాత్మనః ॥ **(6-19)**

ధ్యాన యోగమున చిత్తమును అదుపులో ఉంచిన యోగిని గాలి లేని చోట చలింపని దీపముతో పోల్చబడుచున్నది.

యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా ।

యత్ర చైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి ॥ **(6-20)**

యోగాభ్యాసముచే నిగ్రహింపబడిన చిత్తముతో తనను పరమాత్మునియందు తెలుసుకొని తృప్తిపడును.

సుఖమాత్యంతికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీంద్రియమ్ ।

వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః ॥ **(6-21)**

ఏదైతే ఇంద్రియములకు అతీతమైనదై బుద్ధిచే గ్రహంచబడు అత్యంత సుఖమునిచ్చు పరమ సత్యమును తెలుసుకొని ఆ సత్యము నుండి చలింపక స్థిరముగా నుండి ....

యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః ।

యస్మిన్ స్థితో న దు:ఖేన గురుణాపి విచాల్యతే ॥ **(6-22)**

దేనిని పొంది ఇతర లాభమును దానికంటే ఎక్కువైన దానిగా తలంపక ఏ స్థితియందుండి ఇతరత్రా దు:ఖముచే మిక్కిలి క్లేశము కలిగియున్నప్పటికినీ చలించడో ....

తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్ ।

స నిశ్చయేవన యోక్తవ్యో యోగోనిర్విణ్ణచేతసా ॥ **(6-23)**

ఆ దు:ఖ నాశకమగు యోగ సమాధిని తెలుసుకొనవలెనను స్థిర నిశ్చయముతో నియమ భంగము లేని మనస్సుతో యోగాభ్యాసము చేయవలెను.

ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్ ।

ఉపైతి శాంతరజసం బ్రహ్మభూతమకల్మషమ్ ॥ **(6-27)**

ఈ యోగి మనస్సు ప్రశాంతతనొంది ఉత్తమమైన సుఖమును పొందును. రజోగుణము పూర్తిగాపోయి పూర్వము చేసిన పనుల ఫలితములన్నిటినుండి ముక్తుడగును.

యుంజన్నేవం సదాత్మానం యోగీ విగతకల్మషః ।

సుఖేన బ్రహ్మసంస్పర్శమ్ అత్యంతం సుఖమశ్నుతే ॥ **(6-28)**

ఆవిధంగా ఎల్లప్పుడూ యోగాభ్యాముున నిమగ్నుడైయుండెడి యోగి కల్మషములన్నియు నశించి, పరమాత్మతో కూడియుండెడి సుఖమునందు అత్యంత సుఖమును పొందును.

సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।

ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥ **(6-29)**

యోగయుక్తుడైన యోగి సకల జీవులయందున్న ఆత్మ నేనుగా అన్ని జీవులను నాయందు చూచును. అంతటను నన్ను చూచి అన్నిటినీ సమముగా చూచును.

యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।

తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ॥ **(6-30)**

ఎవడు నన్ను అంతటా అన్నిటినీ నాయందు చూచునో అతనికి నేను కనపడకపోను. అతడును నా దృష్టియందుండును.

సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః ।

సర్వథా వర్తమానోపి స యోగీ మయి వర్తతే ॥ **(6-31)**

అన్ని జీవులయందున్న ఆత్మ, నేను ఒకటేనని తెలుసుకొని నన్ను భక్తితో సేవించిన యోగి సర్వావస్థలయందును నాయందు నిలిచియుండును.

## 8.6.1 యోగ భ్రష్టుడు :

అయతిః శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః ।

అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి ॥ **(6-37)**

శ్రద్ధతో యోగాభ్యాసము చేయుచు మనస్సు యోగమునందు నిశ్చలముగా లేని కారణమున యోగసిద్ధిని పొందజాలనివాడు ఎటువంటి గమ్యమును పొందుననగా ....

పార్థ నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే ।

న హి కల్యాణకృత్ కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి ॥ **(6-40)**

అతనికి ఈ ప్రపంచమునగాని, మరుజన్మలోగానీ నాశము ఉండదు. మంచి పనులయందు నిమగ్నుడైనవాడు పతనమవడు.

ప్రాప్య పుణ్యకృతాం లోకాన్ ఉషిత్వా శాశ్వతీః సమాః ।

శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోభిజాయతే ॥ **(6-41)**

యోగభ్రష్టుడు పుణ్య కార్యములు చేసినవారు పొందెడు లోకములో పెక్కు సంవత్సరములు నివసించి పవిత్రులైన సంపన్నుల గృహమందు జన్మించును.

అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్ ।

ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్ ॥ **(6-42)**

లేదా జ్ఞానవంతులైన యోగుల కుటుంబమున జన్మించును. కాని ఈ ప్రపంచమున అటువంటి జన్మ అరుదుగా ఉండును.

తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదేహికమ్ ।

యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునందన ॥ **(6-43)**

అక్కడ అతడు పూర్వజన్మ సంస్కారము వలన యోగసిద్ధి కొరకు మరల ప్రయత్నించును.

పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోపి సః ।

జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే ॥ **(6-44)**

అతడు జ్ఞానము పొందవలెనను కోర్కె కలవాడైనప్పటికీ శాస్త్రములలో తెలిపిన కర్మలకు అతీతంగా పూర్వ జన్మమునందలి యోగాభ్యాసము వలన అప్రయత్నముగా ధ్యానయోగమువైపు ఆకర్షింపబడును.

ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః ।

అనేకజన్మసంసిద్ధః తతో యాతి పరాం గతిమ్ ॥ **(6-45)**

అట్టి యోగి యోగాభ్యాసము ద్వారా ప్రయత్నించుచు పాపములు ప్రక్షాళింపబడి కొన్ని జన్మల తరువాత సిద్ధిపొంది అటు పిమ్మట మోక్షమును పొందును.

## 8.7 భక్తి యోగం :

మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః ।

భజంత్యనన్యమనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్ ॥ **(9-13)**

మహాత్ములు దైవీ ప్రకృతినాశ్రయించి నన్ను సకల భూతములకు మూలముగా, శాశ్వతునిగా తెలుసుకొని, అచంచలమైన మనస్సుతో నన్ను భజింతురు.

సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః ।

నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే ॥ **(9-14)**

దృఢ నిశ్చయముతో మోక్షము కొరకు ప్రయత్నించుచు, ఎల్లప్పుడు నన్ను కీర్తిస్తూ నమస్కరిస్తూ నిత్యము భక్తితో నన్ను ఉపాసింతురు.

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।

తదహం భక్త్యుపహృతమ్ అశ్నామి ప్రయతాత్మనః ॥ **(9-26)**

పరిశుద్ధమైన అంతరంగముగలవాడు పత్రము, పుష్పము, ఫలము, జలము ఏదైనా నాకు భక్తితో సమర్పించిన దానిని నేను స్వీకరింతును.

సమోహం సర్వభూతేషు న మే ద్వేష్యోస్తి న ప్రియః ।

యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్ ॥ **(9-29)**

నేను అన్నిటియందును సమభావము కలవాడను. నాకు ద్వేషింపదగినవాడుగానీ, ప్రియమైనవాడుగానీ లేదు. కాని ఎవరు భక్తితో నన్ను భజిస్తారో వారు నాయందు, నేను కూడా వారియందు ఉందుము.

అపి చేత్ సుదురాచారో భజతే మామనన్యభాక్ ।

సాధురేవ స మంతవ్యః సమ్యగ్వ్యవసితో హి సః ॥ **(9-30)**

దురాచారి అయినను నన్ను భజించువాడు, నన్ను మాత్రమే చేరవలెనను నిశ్చయముతోనున్నవాడు సాధువుగా పరిగణింపదగినవాడు.

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి ।

కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥ **(9-31)**

ఏలననగా అతడు శీఘ్రముగానే ధర్మాత్ముడై శాశ్వత శాంతిని పొందును. నా భక్తుడెన్నటికినీ నష్టపడడు.

మాం హి పార్థ వ్యపాశ్రిత్యయేపి స్యుః పాపయోనయః ।

స్త్రియో వైశ్యాస్తథాశూద్రాః తేపి యాంతి పరాం గతిమ్ ॥ **(9-32)**

నా శరణుజొచ్చువారు అధమ జన్ములైనను, స్త్రీలైనను, వైశ్యులైనను, శూద్రులైనను, పరమగతిని పొందుదురు.

కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయస్తథా ।

అనిత్యమసుఖం లోకమ్ ఇమం ప్రాప్య భజస్వ మామ్ ॥ **(9-33)**

ఇక బ్రాహ్మణులు, పుణ్యాత్ములు, భక్తులు, రాజర్షుల గురించి వేరుగా చెప్పనేల? అశాశ్వతము, సుఖము లేనిది అయిన ఈ లోకమున నన్ను భజింపుము.

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।

మామేవైష్యసి యుక్త్వైవమ్ ఆత్మానం మత్పరాయణః ॥ **(9-34)**

నన్ను మనసున నిలిపి నా భక్తుడవగుము. నన్ను పూజింపుము. నాకు నమస్కరింపుము. ఈవిధముగా నా భక్తియందు నిమగ్నుడవై నన్నే పొందెదవు.

మచ్చిత్తా మద్గతప్రాణాః బోధయంతః పరస్పరమ్ ।

కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ ॥ **(10-9)**

నా భక్తులు నాయందు మనసుంచి నాకే జీవితమునర్పించి నన్ను గురించి ఎల్లప్పుడును ఒకరికొకరు బోధించుకొనుచు, చర్చించుకొనుచు, తృప్తినొంది దివ్యానందమును అనుభవింతురు.

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।

దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే ॥ **(10-10)**

ప్రీతితో నా సేవలో నిమగ్నులైన భక్తులకు నన్ను పొందగల బుద్ధియోగమును ఇచ్చెదను.

తేషామేవానుకంపార్థమ్ అహమజ్ఞానజం తమః

నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥ **(10-11)**

వారిపై ప్రత్యేకానుగ్రహము చూపుట కొరకు వారి హృదయమున ఉండి తేజోమయమైన దీపమువంటి జ్ఞానముచే చీకటి వంటి అజ్ఞానమును నశింపజేయుదును.

అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్ ।

అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ ॥ **(12-9)**

ఒకవేళ మనస్సును నాయందు స్థిరము చేయుటకు సమర్థుడవు కానిచో భక్తి యోగాభ్యాసముచే నాయందు మనస్సును స్థిరము చేసి, అప్పుడు నన్ను పొందుటకు కోరుము.

అభ్యాసేప్యసమర్థోసి మత్కర్మపరమో భవ ।

మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి ॥ **(12-10)**

అభ్యాసము (సాధన) చేయుటకు కూడా అసమర్థుడవైనచో నా కొరకు పనులు చేయుము. నా కొరకు పనులు చేయుచు కూడా సిద్ధిని పొందగలవు.

అథైతదప్యశక్తోసి కర్తుం మద్యోగమాశ్రితః ।

సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ ॥ **(12-11)**

నన్నాశ్రయించి కనీసం ఇది చేయుటకును అసమర్థుడవైనచో నీవు చేసిన పనుల ఫలములను త్యజించి ఆ తరువాత ఆత్మయందుండుటకు ప్రయత్నింపుము.

శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే ।

ధ్యానాత్ కర్మఫలత్యాగః త్యాగాచ్ఛాంతిరనంతరమ్ ॥ **(12-12)**

అభ్యాసము కంటే జ్ఞానము, జ్ఞానము కంటే ధ్యానము, ధ్యానము కంటే కర్మఫల త్యాగము మేలైనవి. త్యాగము వలన శాంతిని పొందవచ్చును.

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ ।

నిర్మమో నిరహంకారః సమదు:ఖసుఖః క్షమీ ॥ **(12-13)**

సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।

మయ్యర్పితమనోబుద్ధిః యో మద్భక్తస్స మే ప్రియః ॥ **(12-14)**

అన్నిటియందు ద్వేషము లేకుండా మైత్రి, కరుణ గలవాడు నాది అనే మమకారం, అహంకారం లేనివాడు, సుఖదు:ఖములయెడ సమభావము, క్షమాగుణము కలవాడు, తృప్తిగలవాడు, దృఢ నిశ్చయముతో నాయందు మనస్సు బుద్ధులను అర్పించి ఆత్మ నిగ్రహముగల యోగి అయిన నా భక్తుడు నాకు ఇష్టమైనవాడు.

యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః ।

హర్షామర్షభయోద్వేగైః ముక్తోయస్స చ మే ప్రియః ॥ **(12-15)**

ఎవని వలన లోకము (జనులు) కలతనొందరో, ఎవడు లోకము వలన కలత చెందడో, ఎవడు దుఃఖము, భయము, సంతోషము, ఉద్వేగము లేనివాడో అతడు నాకు ప్రియమైనవాడు.

మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే ।

శ్రద్ధయా పరయోపేతాస్తే మే యుక్తతమా మతాః ॥ **(12-2)**

నా యందు ఏకాగ్రతతో మనస్సు నిల్పి ఎవరు నన్ను శ్రద్ధతో నిరంతరం ఉపాసిస్తారో వారు నాచే భక్తి యోగమునందు పరిపూర్ణులుగా భావింపబడుదురు.

యే త్వక్షరమనిర్దేశ్యమ్ అవ్యక్తం పర్యుపాసతే ।

సర్వత్రగమచింత్యం చ కూటస్థమచలం ధ్రువమ్ ॥ **(12-3)**

సంనియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః ।

తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితేరతాః ॥ **(12-4)**

ఎవరైతే ఇంద్రియమునన్నిటినీ నిగ్రహించి అన్నిటియందును సమబుద్ధిగలవారై అన్నిటి యొక్క క్షేమము చేకూర్చుటయందు నియుక్తులై ప్రకృతికి అతీతము, నిర్వచింపలేని, వ్యక్తము కాని ఊహాతీతము, మార్పులేని, నిశ్చలమైన, స్థిరమైన అంతటను

ఉన్న నన్ను ఉపాసిస్తారో (పూజ, జపము, ధ్యానము, భజన) వారు నన్ను తప్పక పొందుదురు.

క్లేశోధికతరస్తేషామ్ అవ్యక్తాసక్తచేతసామ్ ।

అవ్యక్తా హి గతిర్దు:ఖం దేహవద్భిరవాప్యతే ॥ **(12-5)**

పరమాత్ముని అవ్యక్త తత్త్వమునందు ఆసక్తిగలవారికి వానిని పొందుటకు చేయు సాధనలో పురోగతి చాలా శ్రమతో కూడియుండును.

యే తు సర్వాణి కర్వాణి మయి సన్న్యస్య మత్పరాః ।

అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే ॥ **(12-6)**

తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।

భవామి నచిరాత్ పార్థ మయ్యావేశితచేతసామ్ ॥ **(12-7)**

ఎవరు వారి పనులన్నిటిని నాకర్పించి నాయందు ఆసక్తి కలిగియుండి నాయందు స్థిరమైన మనస్సు కలిగియుండి నన్ను ధ్యానము చేయుచు ఉపాసిస్తారో వారిని నేను త్వరగానే జనన మరణములనుండి ముక్తులను చేసెదను.

మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ ।

నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ॥ **(12-8)**

నాయందు మనస్సును నిల్పుము. బుద్దిని నాయందు నియమింపుము. ఆ తరువాత నిస్సందేహంగా నాయందే నివసింతువు.

అనపేక్షః శుచిర్దక్షః ఉదాసీనో గతవ్యథః ।

సర్వారంభ పరిత్యాగీ యో మద్భక్తః సమేప్రియః ॥ **(12-16)**

ఆశలేనివాడు, పవిత్రుడు, సమర్థుడు, ఉదాసీనుడు, దు:ఖములు పోయినవాడు, అన్ని ప్రయత్నములు వదలినవాడు అయిన నా భక్తుడు నాకు ప్రియమైనవాడు.

యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి ।

శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః ॥ **(12-17)**

ఎవడు సంతసించడో, ద్వేషించడో, దు:ఖించడో, కోరడో, శుభాశుభములను విడుచునో అట్టి నా భక్తుడు నాకు ఇష్టుడు.

సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః

శీతోష్ణసుఖదు:ఖేషు సమస్సంగవివర్జితః ॥ **(12-18)**

తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్ ।

అనికేతః స్థిరమతిః భక్తిమాన్ మే ప్రియో నరః ॥ **(12-19)**

శత్రు మిత్రుల యెడ, మానావమానముల యందు, చలి వేడిలయందు, సుఖదు:ఖములలో నిందలు పొగడ్తలలోను సమబుద్ధి గలిగి మౌనము వహించెడివాడును, సాహచర్యము వదలినవాడు, తృప్తిగా ఉండువాడు, నివాసము లేనివాడును, స్థిరమైన బుద్ధి కలిగినవాడును అయిన నా భక్తుడు నాకు ఇష్టమైనవాడు.

యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే ।

శ్రద్ధధానా మత్పరమా భక్తాస్తేతీవ మే ప్రియాః ॥ **(12-20)**

ఎవరు శాశ్వతమైన అమృతం వంటి ఈ ధర్మమును పైన చెప్పిన విధముగా శ్రద్ధతో నేనే సర్వస్వముగా భావించి భక్తితో పాటిస్తారో వారు నాకు ప్రియమైనవారు.

## 9.0 ఉపసంహారం :

ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా ।
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు ॥ **(18-63)**

ఈ విధముగా అతి రహస్యమైన జ్ఞానము వివరింపబడినది. దీనిని పూర్తిగా విశ్లేషించి నీకిష్టమైనట్లు చేయుము.

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోసి మే ॥ **(18-65)**

నన్నే తలచి నా భక్తుడవై నన్ను పూజించి నమస్కరింపుము. నన్నే పొందెదవని సత్యముగా నీకు వాగ్దానము చేయుచున్నాను.

ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన ।
న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోభ్యసూయతి ॥ **(18-67)**

దీనిని తపస్సు చేయనివానికి, భక్తుడు కానివానికి, దేవునికి సేవ చేయనివానికి నా యెడ అసూయగల వానికి చెప్పరాదు.

య ఇమం పరమం గుహ్యం మద్భక్తేష్వభిదాస్యతి ।
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః ॥ **(18-68)**

ఎవడు ఈ పరమ రహస్యమైన దానిని నా భక్తులకు నా యెడ భక్తితో వివరించునో అతడు నిస్సందేహముగా నన్నే పొందును.

న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।
భవితా న చ మే తస్మాత్ అన్యః ప్రియతరో భువి ॥ **(18-69)**

అట్టివానికన్నా నాకు ఎక్కువ ప్రియమైన వాడు ఈ ప్రపంచంలో లేడు, ఉండడు.

అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాదమావయోః ।
జ్ఞానయజ్ఞేన తేనాహమ్ ఇష్టః స్యామితి మే మతి ః ॥ **(18-70)**

ఎవడు ఈ ధర్మాన్ని చదివి తెలుసుకుంటాడో అతడు జ్ఞాన యజ్ఞముతో నన్ను పూజించినవాడగును.

శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యో నరః ।
సో పి ముక్తః శుభాన్ లోకాన్ ప్రాప్నుయాత్ పుణ్యకర్మణామ్ ॥ **(18-71)**

శ్రద్ధతో వినువాడు ముక్తుడై పుణ్య కర్మలు చేసినవారు పొందు శుభకరమైన లోకమును పొందును.

## 9.1 స్వస్తి :

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।
తత్ర శ్రీర్విజయో భూతిః ధ్రువా నీతిర్మతిర్మమ ॥ **(18-78)**

ఎక్కడ యోగేశ్వరుడైన పరమాత్ముడు ఉండునో, పరమాత్ముని మనసున నిల్పి పరమాత్ముని ప్రేరణననుసరించి కర్తవ్యమును నిర్వర్తించి కర్మ ఫలమును భగవదర్పణము చేయు ధనుర్ధారి అయిన పార్థుని వంటి కార్యశూరుడైన భక్తుడుండునో అచట నీతి, సంపద, విజయము, అసాధారణ శక్తి నిశ్చయముగా ఉండును.

**సర్వే జనా సుఖినో భవంతు**

